జాతీయ జీవిత గ్రంథమాల

# ముత్తుస్వామి దీక్షితార్

రచన

టి.ఎల్. వెంకటరామ అయ్యర్

అనువాదం

టి. సత్యనారాయణ మూర్తి




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

# ఉపోద్ఘాతము

వాగ్గేయకారుడుగా, యోగిపుంగవునిగా, శిష్ట సంప్రదాయ త్రిమూర్తులలో ఒకరుగా శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ కర్నాటక సంగీత జగత్తులో ఇప్పటికి ఒక శతాబ్దానికి పైగా విశిష్ట గౌరవం పొందుతున్నారు. ఆయన జీవితానికి సంబంధించిన సమకాలీన సమాచారం లభించడం లేదు. ఆయనకూ, శ్రీ త్యాగరాజుకూ సంబంధించిన అనేక మహిమాన్విత ఉదంతాలూ, కథలూ మాత్రం బహుళ వ్యాప్తిలో ఉన్నాయి. అయితే వారి కృతులలోని అద్భుతమైన రసజ్ఞత, ఆధ్యాత్మిక ఔచిత్యాలను దృష్టిలో ఉంచుకునే, మనం ఈ వాగ్గేయకారులకు నివాళులర్పిస్తున్నాము. కాని ఆ వాగ్గేయకారుని రచనల మీద వెలుగు ప్రసరింపజేసి, ఆయన ఘనతను మనకు వెల్లడించగలిగినప్పుడే ఆయన జీవిత చరిత్రకు విలువ ఉంటుందని మనం గుర్తుంచుకోవాలి. దీని ననుసరించి ప్రాచీన విశ్వసనీయ సంప్రదాయం లేదా కృతులలోనే ఉన్న అంశలూ సమర్థించే సంఘటనలనూ, ఉదంతాలనూ మాత్రమే నేను ఈ జీవిత చరిత్రలో వివరించాను.

నాజ్ఞాతి సోదరుడైన డాక్టర్ ఎల్. ముత్తయ్య భాగవతార్ ప్రసిద్ధి చెందిన సంగీత విద్వాంసుడు మాత్రమేకాక గొప్ప వాగ్గేయకారుడు కూడా. నేనాయన వద్దనే, సాంప్రదాయ పిద్ధ రీతిలో సంగీతం నేర్చుకున్నాను. 1931 మే 14వ తేదీన నా సంగీత పరిజ్ఞానాన్ని ప్రగాఢంగా ప్రభావితం చేసిన ఒక సంఘటన జరిగింది. ఆ రోజున ఎట్టయ్య పురం వద్ద నున్న కోయిల్‌పట్టీలో దీక్షితార్ కుటుంబానికి చెందిన ఒక సంగీత విద్వాంసుని కలిశాను. ముత్తుస్వామి దీక్షితార్ తమ్ముడైన బాలుస్వామి దీక్షితార్ తనకు కుమారులు లేనందు వలన తన కుమార్తె కుమారుణ్ణి దత్తత చేసుకున్నారు. ఆయనయే సుబ్బరామ

దీక్షితార్. గత వంద సంవత్సరాలలో ఆయనను మించిన సంగీత శాస్త్రజ్ఞుడు లేడని చెప్పడం అతిశయోక్తి కాదు. శిష్ట సాంప్రదాయ సంగీత కళలోఆయన నిధి. ఎట్టయ్యపురం సంస్థాన ఆధ్వర్యంలో "సంగీత సాంప్రదాయప్రదర్శిని" అనే సంగీత సిద్ధాంత గ్రంథాన్ని కూడా ప్రచురించారు. కర్నాటక సంగీత శాస్త్రంపై వెలువడిన గ్రంథాలలో ఇది అత్యంత విలువైనది. తదనంతర గ్రంథకర్తల రచనలన్నింటికీ దీనినుండి గ్రహించిన విషయ పరిజ్ఞానమే పునాది అయింది. సుబ్బరామ దీక్షితార్‌కి, ముత్తుస్వామి దీక్షితార్ అనే కుమారుడున్నాడు. అంబిదీక్షితార్‌గా ఈయన ప్రసిద్ధుడు. ఆయనను నేను 1931మే 14వ తేదీన కోయిల్ పట్టిలో కలిశాను. ముత్తుస్వామి దీక్షితార్ కృతులను ఆయన గానం చేయడం విన్నాను. ఆ కృతులలో ఎక్కువ భాగం అంత పరిచయమైనవి కావు. వాటిని కొత్తగా వినడమే గాక వాటి సంగీత బాణీ నూతనంగానూ, ఆహ్లాదకరంగానూ ఉండడాన్ని అవగాహన చేసుకున్నాను. ఆ కీర్తనలన్నీ లంబకాలంలో గమకాలతో నిండి ఉన్నాయి. వాటిని నేర్చుకోవాలనే తపనతో అంబిదీక్షితార్ మద్రాస్‌లో స్థిరపడడానికి కావలసిన ఏర్పాట్లు చేశాను. ఆయన సమ్ముఖంలోనే నేను ముత్తుస్వామి దీక్షితార్ కృతులను నేర్చుకున్నాను. తన కుటుంబంలో తరతరాలుగా అనుశ్రుతంగా వస్తున్న ముత్తుస్వామి దీక్షితార్ జీవితానికి సంబంధించిన అనేక అంశాలను ఆయన వెల్లడించడం జరిగింది. నేనాయన వద్దనుండి గ్రహించిన అంశాలపైనే ప్రస్తుత రచన చాలా వరకు ఆధారపడి ఉంది. కృతులకు సేకరించిన అంశాలను అదనంగా చేర్చడం జరిగింది. శిష్ట సాంప్రదాయ సంగీత పరిశుద్ధ రమణీయ లక్షణాలను తిరిగి అత్యున్నత శిఖరాలకు చేర్చాలంటే ముత్తుస్వామి దీక్షితార్ కృతులను నేర్చుకొని వాటిని మరింత ఎక్కువగా గానం చేయవలసిన అవసరం ఎంతైనా ఉందని నా అభిప్రాయం.

మద్రాస్ **టి.ఎల్. వెంకటరామ అయ్యర్**

31 ఆగస్టు, 1968

## అధ్యాయం 1

# పూర్వీకులు-తొలి జీవితము

వివిధ దేశాల చరిత్రలలో సంస్కృతి మహోజ్జ్వలంగా వెలిగిన లేదా, యిప్పుడు వాడుకలోనికి వచ్చిన పదం ద్వారా వ్యక్తం చేయాలంటే విస్ఫోటనం చెందిన దశలున్నాయి. కళ, సాహిత్యం కొత్త రూపాలను సంతరించుకొని నూతన శిఖరాల నంటినప్పుడు ఇది జరిగింది. దక్షిణ భారత చరిత్రలో కూడా అటువంటి దశ ఉంది. ఇది పదునెనిమిదవ శతాబ్దమధ్యలో ప్రారంభమై ఒక వంద సంవత్సరాల పాటు కొనసాగింది. దీనిని శిష్ట సాంప్రదాయ కర్ణాటక సంగీతానికి స్వర్ణ యుగంగా పరిగణించడం సమంజసమే. ఈ దశలోనే చాలామంది గణుతికెక్కిన సంగీతవేత్తలు, శిష్ట సాంప్రదాయ కర్ణాటక సంగీతకారులు వర్ధిల్లారు. వారిలో ముగ్గురు మిగిలిన వారిని మించిన అగ్రగణ్యులు. వీరే కర్ణాటక సంగీత త్రయంగా ప్రసిద్ధులైన శ్యామ శాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితార్. శ్యామ శాస్త్రి క్రీ.శ. 1762లోనూ, త్యాగరాజు క్రీ.శ. 1767లోనూ, ముత్తుస్వామి దీక్షితార్ క్రీ.శ. 1775లోనూ జన్మించారు. రాగతాళ ప్రదర్శనలో ఉద్భవించే అద్భుతమైన సొగసులను వ్యక్తం చేయడంలో వారి రచనలకవే సాటి. అవి ఒక విశిష్ట వర్గానికి చెందినవి. వాటిలో శ్యామశాస్త్రి రచనలు జటిలమైన లయ విన్యాసాల (తాళ) లో, త్యాగరాజు రచనలు భావోద్రేకం, శ్రవణానందకర లక్షణాల సమ్మేళన (భావ)లో, ముత్తుస్వామి దీక్షితార్ రచనలు శ్రావ్యమైన సంగీతరూప సంప్రదాయ చిత్రీకరణ (రాగ)లో అతిశయించాయి.

పదునెనిమిదవ శతాబ్దారంభంలో దక్షిణదేశం లోని విరించిపురం అనే స్థలంలో కశ్యప గోత్రానికి చెందిన వెంకటేశ్వర దీక్షితార్ అనే బ్రాహ్మణుడుండే వారు. ఆయనే ముత్తుస్వామి దీక్షితార్ తాతగారు. ఆయన భార్య పేరు భగీరధి. క్రీ.శ. 1735లో వారికి రామస్వామి అనే కుమారుడు జన్మించాడు. ఆయన బాల్యంలో

తమ కుటుంబ భవిష్యత్‌ను పూర్తిగా మార్చివేసిన ప్రముఖ సంఘటన ఒకటి జరిగింది. ఆకాలంలో విరించిపుర ప్రాంతంలో అస్థిర రాజకీయ పరిస్థితులు నెలకొన్నాయి. క్రీ.శ. 1742లో అశ్వికదళ దాడితో ఆప్రాంతానికి శత్రు దండయాత్రా ప్రమాదం ముంచుకు వచ్చింది. దీనితో ప్రజలా ప్రాంతం నుండి పెద్ద ఎత్తున తరలిపోవడం ప్రారంభమైంది. ఈదశలో ఆ స్థలాన్ని వదలిపెట్టి వెళ్ళినవారిలో వెంకటేశ్వర దీక్షితార్ కూడా ఉన్నారు. ఆరోజులలో కావేరీ డెల్టాప్రాంతం తంజావూర్, మహారాష్ట్ర వంశరాజుల ఉదాత్త పరిపాలనలో ఉండేది. సాపేక్షికంగా చూస్తే ఆ ప్రాంతంలో ఎక్కువ శాంతి, సౌభాగ్యం నెలకొని ఉన్నాయి. అందుచేత వెంటేశ్వర దీక్షితార్ తంజావూర్‌రాజ్య ప్రాంతానికి తరలివెళ్ళారు. కావేరీ తీరంలో మధ్యార్జునం వద్ద గోవిందపురం అనే గ్రామం ఉంది. దానిని నెలకొల్పిన గోవింద దీక్షితార్ నుండే ఆ గ్రామానికాపేరు వచ్చింది. గోవింద దీక్షితార్ గొప్ప రాజనీతిజ్ఞుడు, సంస్కృత పండితుడు, తత్త్వవేత్త. తొలి నాయక రాజుల పరిపాలనాకాలంలో తంజావూర్ రాజ్యపరిపాలనా బాధ్యతను నిర్వహించిన దిట్ట. ఈయన నెలకొల్పిన గోవిందపురంలో వెంకటేశ్వర దీక్షితార్ స్థిరపడ్డాడు. ఆతర్వాత క్రీ.శ. 1751 ప్రాంతంలో తమ కుమారుడైన రామస్వామిని తన భవిష్యత్తును తానే దిద్దుకునేందుకు వదలి ఆయన, ఆయన భార్య దివంగతులయ్యారు.

తల్లిదండ్రులు మరణించే నాటికి రామస్వామి వేదాధ్యయనంలో శిక్షణ పొందుతున్నాడు. ఆయనకు పరిపుష్టమైన, సంగీత భరితమైన కంఠస్వర భాగ్యం, సంగీతం ఎడ సహజానురక్తి ఉన్నాయి. కనుకనే విచక్షణాశీలురైన మిత్రులాయనను సంగీతం అభ్యసింపుమని సలహా యిచ్చారు. ఆకాలంలో రాజాదరణ పొందిన అనేక మంది సంగీత విద్వాంసులు తంజావూర్‌లో ఉండేవారు. వారిలో వీరభద్రయ్య ఒకడు. రామస్వామి ఆయన వద్దకు వెళ్ళాడు. అతడి ప్రతిభ చూసి ముగ్ధుడైన వీరభద్రయ్య, రామస్వామిని తన శిష్యుడిగా చేసుకొని శిష్టసాంప్రదాయ సంగీతంలో అతడికి క్షుణ్ణంగా శిక్షణ ఇచ్చాడు. సంగీత కచేరీలు చేయడానికవసరమైన పరిపూర్ణ అర్హత సంపాదించుకొనిన తరువాత రామస్వామి గోవిందపురం తిరిగి వచ్చాడు.

ఆ రోజులలో మధ్యార్జునంలో వెంకట వైద్యనాథ దీక్షితార్ అనే వైణిక విద్వాంసుడుండేవాడు. ఆయన గోవింద దీక్షితార్ వెంకటమఖిల కుటుంబ

సంతతికి చెందిన వాడు. తంజావూర్ నాయకరాజుల మంత్రి అయిన గోవింద దీక్షితార్ గణుతికెక్కిన సంగీత వేత్త కూడా. ప్రసిద్ధి కెక్కిన సంగీత శాస్త్రగ్రంథం "సంగీత సుధ" ఆయన రచనే. "చతుర్దండిప్రకాశిక" అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించినవాడు, ఆధునిక కర్ణాటక సంగీతానికి పాణిని వంటివాడు అయిన వెంకటమఖి గోవింద దీక్షితార్ కుమారుడు. వీరిద్దరూ ప్రసాదించిన ఈ విజ్ఞాన సంపత్తి కంతకూ భాండాగారం అయిన వెంకట వైద్యనాథుడు సంగీతశాస్త్రంలో సమకాలీన గొప్ప సాధికారులలో ఒకడు. సంగీత శాస్త్ర సిద్ధాంత పరిజ్ఞాన బలం లేకుండా గాన కళకు పరిపూర్ణత చేకూరదనే భావంతో రామస్వామి దీక్షితార్ దానిని సాధించేందుకు వెంకట వైద్య నాథుని వద్దకు వెళ్లాడు. వెంకట వైద్య నాథుడాయనకు సంగీత శాస్త్ర విజ్ఞానాన్ని ముఖ్యంగా వెంకటమఖి ఉపదేష్టిత 42 మేళాల జన్యరాగాల పథకాన్ని బోధించాడు.

ఆ తర్వాత రామస్వామి దీక్షితార్ తిరువారూర్‌లో స్థిరపడ్డాడు. కచేరీలు జరుపగల సంగీత విద్వాంసునిగా ఆయన ఖ్యాతి చాలా త్వరితంగానే వ్యాపించింది. తంజావూర్ రాజు నుండి, భూస్వామ్య ప్రభు వర్గం నుండి గౌరవ పురస్కారాలు, పారితోషికాలు ఎన్నో లభించాయి. సంగీత శాస్త్రంలో ఆయనకున్న పరిజ్ఞానానికి గుర్తింపుగా త్యాగరాజ స్వామి ఆలయంలో నాదస్వర కచేరీలను నిర్వహించే బాధ్యతను ఆయనకు ఒప్పగించడం జరిగింది. ఈనాడు అఖిల భారతస్థాయిలో ప్రఖ్యాతిగాంచిన హంసధ్వని రాగాన్ని ఆయనే కల్పించారు. ఇంతేగాక వర్ణాలు, దరువులు, కీర్తనలు, రాగమాలికలు వంటి అనేక రకాల లక్షణ, లక్ష్యాన్విత కృతులను కూడా ఆయన రచించాడు. వాస్తవానికి ఆయన కుమారుడైన ముత్తుస్వామి దీక్షితార్ కృతుల వైభవోపేత చత్రఛాయన మరుగుపడి ఉండకపోతే రామస్వామి దీక్షితార్ రచనలు ఇంతకంటె ఎక్కువ ప్రచారానికీ ఆదరణకూ నోచుకొని ఉండేవి.

రామస్వామి దీక్షితార్‌కు చాలా కాలం వరకు సంతానం కలుగలేదు. దీనికాయన ఒక సాధు పుంగవుని సంప్రదించాడు. దేవి అనుగ్రహం వల్లనే ఆయనకు సంతానప్రాప్తి కలుగుతుందని దీనికి వైదీశ్వరన్ కోయిల్ అనే గ్రామంలోని ఆలయంలో నెలకొని ఉన్న బాలాంబికా దేవిని ఆరాధించమని ఆ

సాధువు సలహా ఇచ్చాడు. అంతకు పూర్వమే చిదంబరనాధస్వామి అనేగొప్ప యోగీశ్వరుడు శ్రీ విద్యారాధనా క్రమంలో దీక్షితార్‌కు దీక్ష ఇచ్చాడు. అందుచేత దీక్షితార్ దేవీబాలాంబికకు తాంత్రిక రీతిలో మండలపూజ చేయడానికి నిర్ణయించుకొన్నాడు. దీనిననుసరించి భార్య సుబ్బమ్మాళ్‌తో కలసి వైదీశ్వరన్ కోయిల్‌కి వెళ్ళి ఆవరణలో పూజలు జరుపుతూ బాలాంబిక వద్ద భజనలు చేస్తూ 40 రోజులు గడిపారు. జనశ్రుతిని బట్టి చివరిరోజున దేవి ఆయనకు కలలో సాక్షాత్కరించి ఒక ముత్యాలసరాన్ని ప్రసాదించినది. దీనికి దీక్షితార్ విస్తుపోయాడు. ఆ ఊరి పెద్దలకీ విషయం వివరించాడు. దేవి ఆయన ప్రార్ధనను మన్నించినదని దాని అర్ధమని త్వరలోనే ముక్తాఫలం వంటి కుమారుడాయనకు కలుగబోతున్నాడని వారీ సంఘటనకు భాష్యం చెప్పారు. ఆ తర్వాత దీక్షితార్ తిరువారూర్‌లోని తన స్వగృహానికి తరలి పోయాడు.

ఒక సంవత్సరంలోనే రామస్వామి దీక్షితార్ ప్రగాఢ విశ్వాసం ఫలించింది. ఆ మహత్తర సంఘటన ఫాల్గుణ మాసంలో సంభవించింది. ఆ రోజులలో శ్రీత్యాగరాజస్వామి ఆలయంలో ప్రతి సంవత్సరం చాలా వైభవోపేతంగా వసంతోత్సవాలను నిర్వహించే వారు. వేదమంత్ర పఠనంతో, నాదస్వర సంగీతంతో, నృత్యాలతో, బాణాసంచా కాల్పులతో పట్టణమంతా మార్మోగేది. ఇటువంటి మంగళ ప్రదమైన వాతావరణంలో రామస్వామి దీక్షితార్‌కి పుత్ర సంతానయోగం కలిగింది. దీక్షితార్ ఆ బాలుని బాలాంబికా వర ప్రసాదంగా భావించి వైదీశ్వరన్ కోయిల్‌లోని కార్తికేయస్వామి పేరు మీదుగా అతడికి ముత్తు కుమారస్వామి లేదా సంక్షిప్తంగా చెప్పాలంటే, ముత్తుస్వామి అని పేరు పెట్టారు. సుబ్రహ్మణ్యస్వామి రాశికి చెందిన కృత్తిక నక్షత్రాన ఈ బాలుడు జన్మించడం అత్యంత విశేషం. వైదీశ్వరన్ కోయిల్‌లో దీక్షితార్‌కి దేవి కలలో కనిపించి ముక్తాహారాన్ని ఇచ్చిన అంశం కూడా దీనికి తోడయింది. తమిళం లోని "ముత్తు" సంస్కృతంలోని "ముక్తా" కు సమానార్ధకం.

దేవీ బాలాంబిక దీక్షితార్ కి కలలో కనిపించి వరమిచ్చిన సంఘటన ఆయన కుటుంబంలో అనుశ్రుతంగా వస్తున్న కధనమైంది. "భజ రేరే చిత్త బాలాంబికం" అనే చరణంతో ప్రారంభమయ్యే ముత్తుస్వామి దీక్షితార్

సుప్రసిద్ద కృతిలో దీనికి దాఖలా చూడవచ్చు. దేవీ బాలాంబిక ఆలయానికి వెళ్లినపుడు ఆమెను కీర్తిస్తూ వ్రాసిన కీర్తన ఇది. "ఓ మనసా! భక్తులకు అన్ని రకాల వరాలను ప్రసాదించే బాలాంబికను ఆరాధించు. భావరాగ తాళాన్విత సంగీతం ఆమెను ప్రసన్నురాలిని చేస్తుంది. భక్తుల ప్రార్ధనలను ఆలకించి వారిని అనుగ్రహిస్తుంది. గురు-గుహావతారుడు భక్తులను కాపాడే ముత్తు కుమారునికి ఆమె తల్లి!"[1] అని ఆయన ఈ కీర్తనలో ప్రస్తావించాడు. సందర్భానుసారం అన్వయించి నట్లయితే ఆమె కీర్తన స్వేచ్ఛానువాదం ఈ క్రింది విధంగా ఉంటుంది. "భావరాగ తాళయుక్తంగా (రామస్వామి దీక్షితార్) ఆలపించిన సంగీతానికి ఆమె ప్రసన్నురాలయింది. (కుమారుడు కావాలని). ఆయన చేసిన ప్రార్ధనను మన్నించి అనుగ్రహించింది. ముత్తుకుమారస్వామి (ముత్తుస్వామి) రూపం ధరించిన గురు-గుహ (ఇది ముత్తుస్వామి దీక్షితార్ కీర్తనలలో ఉండే ముద్ర) ఆమె వర ప్రసాదం."

నిజానికి దేవీ కృప రామస్వామి దీక్షితార్‌కి సమృద్ధిగా లభించింది. ముత్తుస్వామి పుట్టిన తర్వాత కూడా ఆయనకు ముగ్గురు బిడ్డలు కలిగారు- ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. చిన్నస్వామి, బాలుస్వామి కుమారుల పేర్లు, కుమార్తెకు "బాలాంబిక" అని పేరు పెట్టడం విశేషం.

ముత్తుస్వామి బాల్య జీవిత చరిత్ర గురించి క్లుప్తంగా చెప్పాలంటే అది విద్యాభ్యాసానికి పూర్తిగా అంకితమవడమేనని చెప్పవచ్చు. తన కుమారుడు వేదశాస్త్రాలలో విద్వాంసుడు కావాలని రామస్వామి దీక్షితార్ ఆకాంక్ష. అందుచేత ఆయన వేదాధ్యయనానికి ఏర్పాటు చేయడమే కాక సంస్కృతాభ్యాసానికి అనువుగా ముత్తుస్వామిని ఒక ప్రతిభాశాలి అయిన పండితుని వద్దకు పంపాడు. అసాధారణ గ్రహణశక్తి గల ముత్తుస్వామి అచిరకాలంలోనే కావ్యాలపైన, అలంకారాలపైన పట్టు సంపాదించగలిగాడు.

---

[1] భావ రాగ తాళ మోదినీం
భక్తాభీష్ట ప్రదాయినీమ్!
సేవక జన పాలన గురు-గుహరూపము చు కుమార జననీమ్!
భజరేరే చిత్త బాలాంబికాం
భక్త కల్ప లతి కాం కామ్!

సిద్ధాంత కౌముదిని అధ్యయనం చేసి వ్యాకరణ శాస్త్రంలో నిష్ణాతుడయ్యాడు. సంస్కృతంలో ఆయనకు గల ప్రత్యేకమైన ప్రావీణ్యం, పాండిత్యం, అంతా ఆయన రచనలలో ప్రతిఫలించాయి.

మనకు మరింత ఆసక్తి కలిగించేది ఆయన విద్యాభ్యాస అంశం. రామస్వామి దీక్షితార్ గణుతికెక్కిన సంగీత విద్వాంసుడే గాక సంగీత శాస్త్రవేత్త అని కూడా గతంలోనే చెప్పడం జరిగింది. ఆయన తన కుమారునికి సంగీతాభ్యాసంలోనూ, సిద్ధాంతంలోనూ కూడా కట్టుదిట్టమైన శిక్షణ ఇచ్చాడు. ఒకప్రక్క శ్రీపురందరదాసు కాలం నుండీ కర్నాటక సంగీతంలో అనుసరించబడుతున్న పద్ధతులలో ఆచరణాత్మక సంగీతాన్ని, మరొక ప్రక్క ప్రాచీన మధ్యయుగాల రచయితలు వివరించిన రీతులలో మాత్రమే గాక ఆధునిక కర్నాటక సంగీతంపై వెంకటమఖి వంటి రచయితల ప్రతిపాదనల ననుసరించి కూడా సంగీత శాస్త్ర సిద్ధాంతాలను ఆయన తన కుమారునికి బోధ పరిచాడు. వాస్తవానికి వెంకటమఖి విరచిత గీతాలు, ప్రబంధాలు ముత్తుస్వామి దీక్షితార్ విద్యాభ్యాసంలో ప్రముఖ స్థానమాక్రమించాయని ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. ప్రయోగాత్మక సైద్ధాంతిక సంగీత రంగాలు రెండింటిలోనూ ఆయనకుగల ప్రావీణ్యం ముత్తుస్వామి దీక్షితార్ సంగీత సాధనా పరిణామంలో ప్రముఖ పాత్ర వహించింది. ప్రత్యేకంగా గుర్తుంచుకోవలసిన మరొక అంశం కూడా ఉంది. అయన గాత్రం లోనూ, వీణా వాయిద్యంలోనూ కూడా విద్వాంసుడే. ఈ రెండు సంగీత మార్గాలకు విశిష్ట విభిన్న లక్షణాలున్నాయి. ఆయన చేతిలో వాటి సమ్మేళనం విలక్షణమైన చక్కటి సొగసులీనే నూతన బాణీకి ఆలవాలమైంది. ఆయన సంగీతం యొక్క కొన్ని విశిష్ట లక్షణాలను ఆయనకు వైణికగాత్ర సమ్మేళనా కళలో కల విద్వత్తుకి ఆపాదించవచ్చు. ఆయన సంగీత లక్షణాల గురించి సమాలోచించే సందర్భంలో ఈ అంశానికి మరింత ప్రముఖస్థానమివ్వడం జరుగుతుంది.

ముత్తుస్వామి బాల్యదశలో ఆయన కుటుంబ చరిత్రలో అత్యంత ప్రముఖ స్థానమాక్రమించిన సంఘటన ఒకటి జరిగింది. మద్రాస్ సమీపంలో "మనాలి" అనే స్థలం ఉంది. ఆరోజులలో అది ఒక ప్రముఖ సంస్థానానికి

కేంద్రం. ముత్తు కృష్ణ మొదలియార్ దాని అధిపతి. అయన తీర్థయాత్రలు చేస్తూ తిరువారూర్ దర్శించాడు. అచ్చట ఆయన త్యాగరాజస్వామి ఆలయం ముందు నిలబడి ఉండగా రామస్వామి దీక్షితార్ నిర్వహిస్తున్న భజన గీతాలాయన చెవిని పడ్డాయి. అవి ఆయనను ఎంతగానో కదలించాయి. వెనువెంటనే ఆయన రామస్వామి దీక్షితార్‌ను తనతో మనాలి వచ్చి తన ఆస్థాన విద్వాంస పదవిని అలంకరించమని ఆహ్వానించాడు. రామస్వామి దీక్షితార్ దీనికంగీకరించి తన కుటుంబముతో మనాలికి తరలిపోయి అక్కడే స్థిరపడ్డాడు.

రామస్వామి దీక్షితార్ మనాలీలో గడిపిన జీవిత దశ మహోజ్వలమైనది. సంగీత విద్వాంసునిగా ఆయన సాధించిన ప్రావీణ్యం ఆ ప్రాంతంలో ఆయనకు గణనీయమైన గుర్తింపు, ప్రఖ్యాతి తెచ్చిపెట్టాయి. ముత్తుకృష్ణ మొదలియార్ ఆయన ఎడ చాలా గౌరవప్రపత్తులను ప్రదర్శించి కానుకలతో ముంచెత్తాడు. ఆయన మరణానంతరం సంస్థానాధిపత్యం వహించిన వెంకటకృష్ణ మొదలియార్ కళాపోషణలో మరింత ఉదారంగా వ్యవహరించాడు. తాను రచించిన 108 రాగ తాళాన్విత రాగమాలికను రామస్వామి దీక్షితార్ వెంకట కృష్ణ మొదలియార్‌కు అంకితమిచ్చి ఆయన వద్ద నుండి ప్రత్యేక గౌరవాభిమానాలను పొందాడు. వెంకట కృష్ణ మొదలియార్ ఈస్టిండియా కంపెనీ వారికి మద్రాస్‌లో దుబాసిగా కూడా వ్యవహరించే వాడు. ఈ పని మీద ఆయన తరుచు సెయింట్ జార్జ్ కోటకు వెళ్ళవలసి వచ్చేది. అక్కడాయన సంగీత వాయిద్యబృందం వాయించే పాశ్చాత్య సంగీత బాణీలను వినేవాడు. పైగా వాటిని ఆలకించేందుకు ముత్తుస్వామిని, ఆయన సోదరులను కూడా తరుచు తనతో తీసుకవెళ్ళేవాడు. ఈవిధంగా యూరోపియన్ సంగీతంతో దీక్షితార్ కుటుంబానికి ఏర్పడిన సాన్నిహిత్యం దక్షిణ భారత సంగీత పరిణామంపై ప్రగాఢ ప్రభావాన్ని నెరపింది. ఈ దశలోనే ముత్తుస్వామి పాశ్చాత్య వాయిద్య బృందం ప్రదర్శించిన అనేక శ్రవణానందకర గీతాలను ఆకళింపు చేసుకున్నాడు. ఆ రోజులలో కర్నల్ బ్రౌన్ అనే ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి ఇంగ్లీష్ (పాశ్చాత్య) సంగీత రాగాలను భారతీయులకు పరిచయం చేయాలని ఉబలాటపడే వాడు. వయస్సు వచ్చిన తర్వాత ముత్తుస్వామి ఆయన సలహాపై ఇంగ్లీష్ రాగాలకు సంస్కృత సాహిత్యాన్ని (పదాలను) సమకూర్చాడు.

అటువంటివి దాదాపు 50గీతాలు మనకు లభించాయి. "గాడ్ సేవ్ ది కింగ్" అనే సుప్రసిద్ధ గీతం దీనికి చక్కటి ఉదాహరణ. ఇంగ్లీష్ పదాల స్థానంలో దీక్షితార్ సమకూర్చిన సంస్కృత సాహిత్యం దేవికి ఉద్దేశితమైనది. ఆమె రక్షణను అర్థించేది.[1]

దీక్షితార్ సాహిత్యాన్ని వింటూ ఉంటే ఇంగ్లీష్‌లో మెరుగులు దిద్దుకొన్న పాతరాగం మిరుమిట్లు గొలిపే ఆకర్షణీయమైన సంస్కృత దుస్తులను ధరించి మనోహరమైన, వైభవోపేతమైన నూతన జీవితంలో ప్రవేశించిందనే భావం కలుగుతుంది. ఇదే విధంగా ఆయన ఇతర ఇంగ్లీష్ రాగాలకు సమకూర్చిన సాహిత్యం కూడా హిందూదేవతా పరంపరను కీర్తించేదే. వాటన్నిటికీ దేని సొగసు దానికుంది. శిష్ట సాంప్రదాయ సంగీతాన్ని నేర్చుకునే వారికి తొలిదశలో సులభ సంగీత ఖండాలుగా వీటిని నేర్పవచ్చు. నేర్పడం జరుగుతోంది కూడా. కానయితే ఈ గీతాలకు అధికతర ప్రాముఖ్యం ఇవ్వకుండా తగిన జాగ్రత్త వహించవలసి ఉంది. శాస్త్రీయ అంచనాలను బట్టి భారతీయ శిష్ట సాంప్రదాయ సంగీత వ్యవస్థలో ఈ గీతాలకు నిజమైన స్థానం లేదు. ఆ సంగీతాంబరానికి రాగతాళాలు పడుగు పేకల వంటివి. కాని ఈ గీతాలకు వాటితో సంబంధమేలేదు.

దీక్షితార్ కుటుంబానికి పాశ్చాత్య సంగీతంతో ఏర్పడిన సాన్నిహిత్యం వలన ఒనగూడిన మరింత ఘనమైన లబ్ధి వాయులీనం. సంగీత కచేరి నిలయవాయిద్యంగా నిలదొక్కుకొనదు. అది భారతీయ శిష్ట సాంప్రదాయ సంగీతానికి పరిచయమైనది కాదు. ఒకానొకప్పుడు మన సంగీతంలో దానిని ఉపయోగించడం జరిగిందని దానిని మనవారు "ధనుర్వీణ" అనే వారనే వాదన ఉన్నమాట నిజమే. దీనిని గురించి వివాదంలోకి దిగకుండా చెప్పాలంటే అది ఒకానొకప్పుడు భారతదేశంలో వాడుకలో నున్నప్పటికీ చాలాకాలం క్రితమే కనుమరుగయిందని, దాని జీవిత సాంప్రదాయ చిహ్నాలు కూడా ఈనాడు మిగలలేదనీ చెప్తేచాలు. రామస్వామి దీక్షితార్ ఆయన కుమారులు సెయింట్ జార్జి కోటకు వెళ్ళినప్పుడు అచ్చటి వాయిద్యబృందం నిర్వహించే కచేరీలో వాయులీనానికున్న ప్రముఖ పాత్ర వారికి ముచ్చట గొలిపింది. వీణా

---

[1] సతతం పాహిమాం సంగీత శ్యామలే సర్వాధారే
జనని చింతితార్థ ప్రదేచిద్రూపి శ్రీ శివే
శ్రీ గురుగుహ పూజితే శివ మోహకారే
సతతం పాహిమామ్.

వాయిద్యాన్ని వినియోగించిన రీతిలోనే వాయులీనాన్ని కూడా సహవాయిద్యంగా ఉపయోగించ వచ్చుననే ఆలోచన వారికి సందర్భంలోనే తట్టిందనేది తథ్యం. అందుచేతనే ముత్తుస్వామి వీణా వాయిద్యం నేర్చుకొంటున్న దశలోనే బాలుస్వామికి వాయులీన వాయిద్యం నేర్చుకొనే బాధ్యతను ఒప్పగించడం జరిగింది. దీనికి వెంకట కృష్ణ మొదలియారే ఒక యూరోపియన్ సంగీతోపాధ్యాయుని నియమించాడని చెప్తారు. మూడు సంవత్సరాలలో బాలుస్వామి వాయులీన వాయిద్య సంగీతంలో నిష్ణాతుడై ముత్తుస్వామి వీణాకచేరీలలో ఆయనకు తన వాయిద్యంపై సహకరించగల సామర్థ్యం సంపాదించగలిగాడు. ఈవిధంగా మొదట చిన్న ప్రయోగంగా ప్రారంభమైన కృషి చివరకు విజయవంతమైన ప్రక్రియగా స్థిరపడింది. దీని ఫలితంగా దక్షిణ భారతదేశ సంగీత కచేరీల నిర్వహణా పద్ధతిలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. తంజావూర్ సోదరులలో ఒకడైన వడివేలు ముత్తుస్వామి దీక్షితార్ శిష్యుడు. ఆయన వాయులీన వాయిద్య సంగీతంలో గొప్ప నిష్ణాతుడయ్యాడు. తాను మహారాజా స్వాతి తిరునాళ్ ఆస్థాన విద్వాంసుడయిన తరువాత తిరువాన్కూర్ సంస్థానంలో వాయులీనాన్ని ప్రవేశపెట్టాడు. సమకాలీన దశలో అగ్రగణ్య వాయులీన విద్వాంసునిగా విరాజిల్లిన తిరుకోడికవల్ కృష్ణయ్యర్, ముత్తుస్వామి దీక్షితార్ శిష్య శ్రేణికి చెందిన వాడు. వాయులీనం కర్ణాటక సంగీతంలో ఉపయోగించడానికనువు అయిన స్థాయికి పెరగడానికి ఆయనే బాధ్యుడు. ఆనాటి నుండి వాయులీన విహీనమైన సాంప్రదాయ సంగీత కచేరీని పరిపూర్ణమైనదిగా పరిగణించడం జరగడం లేదు. అయితే హిందూస్తానీ సంగీతం లో మాత్రం వాయులీనానికి ఇటువంటి ఉన్నత స్థానం లభించక పోవడం గమనార్హం.

ఈ దశలోనే ముత్తుస్వామి దీక్షితార్ జీవితంపై ప్రగాఢమైన ప్రభావం నెరిపిన సంఘటన ఒకటి జరిగింది. చిదంబరనాథ యోగి, రామస్వామి దీక్షితార్ గురువని ఆయనే దీక్షితార్‌కి శ్రీవిద్యారాధనాలో దీక్ష ఇచ్చి, తాంత్రిక పూజా పద్ధతిని నేర్పాడని ఇది వరకే చెప్పడం జరిగింది. ఆయన గొప్పయోగి, వేదాంతికూడా. సన్యాసిగానే కాకుండా మహర్షిగా, తత్త్వవేత్తగా కూడా దేశమంతా గౌరవ సత్కారాలు పొందిన మహనీయుడు. ఆయన కాశీ యాత్రకని దక్షిణాది నుండి బయలుదేరి మద్రాస్‌లో తాత్కాలికంగా మకాం చేశాడు. ఈ సంగతి తెలిసిన రామస్వామి దీక్షితార్ ఆయనను తన ఇంటికి భిక్షకు ఆహ్వానించాడు. చిదంబరనాథస్వామి

దీనికంగీకరించాడు. వెంకట కృష్ణ మొదలియార్ కూడా ఆయనను సగౌరవంగా ఆహ్వానించి మనాలిలో ఆయన వసతికి సకల ఏర్పాట్లను చేసాడు. ముత్తుస్వామి దీక్షితార్, ఆయన సోదరులు చిదంబరనాథస్వామికి సపర్యలు చేసి ఆయన పూజా కాలంలో పాటలు పాడేవారు. రోజులు గడిచాయి. చిదంబరనాథస్వామి తన యాత్రను కొనసాగించడానికి సన్నద్ధమయ్యారు. ఆ సందర్భంలో రామస్వామి దీక్షితార్ ఆయన కుటుంబ సభ్యులు స్వామి వారికి సాష్టాంగ నమస్కారము చేసి తమకాశీస్సులనిమ్మని ప్రార్థించారు. అప్పుడు స్వామీజీ రామస్వామిని ఉద్దేశించి "నేను నిన్నొక కోరిక కోరుదామనుకుంటున్నాను. నీవు దానిని తీరుస్తావా?" అని అడిగారు. దానికి రామస్వామి "మీరు సన్యాసులు, పైగా నాకు గురువులు, నన్ను ఆదేశించగలిగిన వారు, నన్ను కోరడమేమిటి?" అని ప్రశ్నించాడు. దీనికి "నేను కోరిన దానిని అనుగ్రహిస్తావా?" అని చిదంబరనాథ స్వామి తిరిగి ప్రశ్నించాడు. "తప్పకుండా చేస్తానని" రామస్వామి దీక్షితార్ సమాధానమిచ్చాడు. "అయితే నీ కుమారుడైన ముత్తుస్వామిని నాకు శిష్యునిగా అర్పించి నాతో యాత్రకు పంపు" అన్నారు చిదంబరనాథస్వామి. రామస్వామి దీక్షితార్ చెవులలో పిడుగుపడి నట్లయింది. నిశ్చేష్టుడై పోయాడు. కొద్దిసేపటి వరకు ఆయన నోట మాట రాలేదు. తేరుకున్న తరువాత జవాబు కోసం స్వామీజీ తన వైపే చూస్తున్నట్లు గ్రహించాడు. అప్పుడాయన "స్వామీ! ఎడతెగని ప్రార్థనలు తపస్సు చేసిన తర్వాత వయస్సు గడిచిన దశలో నాకు ముత్తుస్వామి కలిగాడు. ఎక్కడ కాశీ? మేముండేదెక్కడ? అతడిని చూడకుండా మేం ఎలా జీవించగలం?" అన్నాడు. దీనికి "నీ వాగ్దానాన్ని నీవు నిలుపుకోదలచు కోకపోతే ఆ విషయం చెప్పెయ్యి, నే వెళ్ళిపోతాను" అన్నాడు చిదంబరనాథస్వామి. "గురువు గారూ! వాగ్దానభంగం నుండి నన్ను విముక్తుణ్ణి చేయుమని ప్రార్థిస్తున్నాను" అని రామస్వామి,చిదంబరనాథస్వామి ముందు సాష్టాంగ పడ్డాడు. చిదంబరనాథస్వామి ఇక లేవబోతున్న తరుణంలో ఆయన ఆశీస్సులు పొందాలనే అభిలాషతో వెంకటకృష్ణ మొదలియార్ అక్కడకు వచ్చాడు. ఆ తర్వాత జరిగిందంతా తెలుసుకొని రామస్వామి దీక్షితార్‌తో "అయ్యా! మీరెందుకంతగా గాబరా పడుతున్నారు? విశ్వామిత్రుడు యౌవనప్రాయంలో ఉన్న రాముణ్ణి తనతో అడవికి తీసుకవెడుతానంటే దశరథుడు కలత చెందాడు. చివరకు వశిష్టుని

సలహాపై రాముణ్ణి పంపాడు. విశ్వామిత్రుడితో వెళ్ళడం వలన రాముడి కెంతో మేలు జరుగలేదా? స్వామి వారు ముత్తుస్వామిని తన శిష్యుడిగా స్వీకరించి తనతో తీసుకవెళ్లాలని అనుకుంటున్నారంటే అది అతడికి లాభం చేకూర్చడానికే అయి ఉంటుంది. అయ్యా! మీ మాట నిలబెట్టుకోండి. సంకోచించకండి. ముత్తుస్వామిని పంపండి. ఇదంతా మీకు మేలు చేస్తుంది!" అని బోధ పరిచాడు.

రామస్వామి దీక్షితార్ మెత్త పడవలసి వచ్చింది. ముత్తుస్వామిని చిదంబరనాథ స్వామికి అప్పగించాడు. ఆ తర్వాత చిదంబరనాథ స్వామి, రామస్వామి దీక్షితార్‌ను ఆయన కుటుంబ సభ్యులను వెంకట కృష్ణ మొదలియార్‌ను ఆశీర్వదించి, ముత్తుస్వామిని తీసుకొని తిరిగి యాత్రకు బయలుదేరాడు.

# అధ్యాయం 2

## కాశీ

ఆ రోజుల్లో దక్షిణ భారతదేశం నుండి కాశీకి ప్రయాణం చేయడం గొప్ప ప్రయాసతో కూడిన పని. అదొక సుదీర్ఘయాత్ర. అందులో చాలా భాగం కాలి నడకనే పూర్తి చేయాలి. అంతేగాక దారంతా బందిపోట్లు, అడవి జంతువులు కల్పించే అవాంతరాలకు ఆలవాలం. అందుచేత యాత్రీకులు బృందాలుగా ఏర్పడి మజిలీలు చేసుకుంటూ, దారిలోని పవిత్రస్థలాలను దర్శిస్తూ, సత్రాలలో విశ్రాంతి తీసుకుంటూ నెమ్మదిగా ప్రయాణం చేస్తూ ఉండేవారు. ఈ ప్రయాణము కొన్ని నెలలు పట్టేది. అందుచేతే "కాశీ వెళ్లినవాడు భద్రంగా తిరిగి వచ్చేవరకు బ్రతికి ఉన్నాడనే భరోసా లేదు," అనే సామెత వచ్చింది. స్వామి వారితో తన కొడుకుని కాశీకి పంపడానికి సంకోచించిన రామస్వామి దీక్షితార్‌ను, ఈ భావనయే భయకంపితుణ్ణి చేసింది.

అయితే ముత్తుస్వామి దీక్షితార్ అంతగా ప్రయాస పడవలసిన అవసరం లేకపోయింది. చిదంబరస్వామి దేశమంతా తెలిసిన మహనీయుడు కాబట్టి ఆయన ఎక్కడకు వెళ్ళినా గౌరవాదరాలు లభించాయి. ఇటువంటి శుభానుకూల వాతావరణంలో సాగిన ప్రయాణం, ముత్తుస్వామికి సుఖంగానే ఉంది. యోగి పుంగవులు, ఆయన మద్రాసులో బయలుదేరి దారిలో పవిత్రస్థలాలను దర్శిస్తూ ఉత్తర దేశాభిముఖులై పయనించి చివరకు కాశీ చేరారు. అక్కడ ఇద్దరూ ఐదారు సంవత్సరాలు కలిసి నివసించారు.

ముత్తుస్వామి దీక్షితార్ జీవితాన్ని తీర్చిదిద్దడంలో ఈ దశను అత్యంత ముఖ్యమైనదిగా పరిగణించ వలసి ఉంది. చిదంబరనాథ యోగి ఆధ్వర్యంలోనూ, మార్గదర్శకత్వంలోనూ ఆయన ప్రగాఢ మతపరమైన, పరమాధ్యాత్మికమైన జీవితం గడిపాడు. యోగీశ్వరులు ఆయనకు శ్రీవిద్యాదీక్ష ఇచ్చారు: షోడశాక్షరీ మంత్రాన్ని

ఉపదేశించాడు. తాంత్రికారాధనా తంతులో శిక్షణ ఇచ్చాడు. శంకరాచార్య ప్రతిపాదిత రీతులలో, యోగ, వేదాంత విద్యలలో శిక్షణ ఇచ్చాడు. దీక్షితార్ వేకువఝాముననే లేచేవాడు. పవిత్ర గంగానదిలో స్నానం చేసేవాడు. ఆ తర్వాత దేవీ పూజ చేసేవాడు. అది పూర్తి చేసిన తరువాత చిదంబరనాథ యోగి వద్ద వేదాంత పాఠాలను అభ్యసించే వాడు. అటు పిమ్మట దేవాలయానికి వెళ్ళి విశ్వేశ్వరుని, అన్నపూర్ణను, విశాలాక్షిని పూజించేవాడు. తన నివాసానికి తిరిగి వచ్చిన తరువాత మధ్యాహ్న పూజలు చేస్తున్న తన గురువు వద్ద కూర్చొని వేద పఠనం చేసేవాడు. పాటలు పాడేవాడు, వీణ వాయించే వాడు. సాయంత్రం మళ్ళీ ఆలయాన్ని దర్శించి దేవతలను ఆరాధించే వాడు. ఆతర్వాత యోగీశ్వరులు రాత్రి పూజ చేసే వేళ భజన గీతాలాలపించే వాడు. ఇదీ కాశీ లో ఉన్నంతకాలం దీక్షితార్ దినచర్య. రూపురేఖలు దిద్దుకుంటున్న జీవిత దశలో సంవత్సరాల పాటు ఇటువంటి జీవితం గడిపిన వ్యక్తి మేధస్సు క్రమబద్ధమై అతడిని ధర్మ, భక్తి, జ్ఞాన మార్గాభిముఖుణ్ణి చేయడం అనివార్యం. అదే దీక్షితార్ విషయంలో జరిగింది. అతడి రచనలలో ఇది పరిపూర్ణంగా ప్రతిబింబించినది.

కాశీలో ఉన్న కాలంలోనే గురుశిష్యులిద్దరూ, ఉత్తరభారత దేశంలోని అనేక పవిత్రాలయాలను దర్శించి ఉండాలి. ఆ పర్యటనల గురించి మనకు తగిన సమాచారం లభించడం లేదు. కాని దీక్షితార్ కృతులలో వాటి ఛాయలున్నాయి. కృతికర్తగా మారినానంతరం తానారాధించిన ఉత్తరభారత ఆలయాలను ఆయన తన మనస్సులో సాక్షాత్కారింప చేసుకున్నాడు. ఆ ఆలయాలలోని దేవతలను కీర్తిస్తూ రచనలు చేశాడు. వీటిలో కొన్ని మనకు లభించాయి. అవి అత్యంత విలువైన సమాచారాన్ని అందిస్తున్నాయి. వారణాసిలోనే వేంచేసి ఉన్న విశ్వేశ్వరుని, విశాలాక్షిని, అన్నపూర్ణను, కాలభైరవుని కీర్తించే రచనలు ఆశించిన రీతిలోనే ఉన్నాయి. కాశీ గంగానదిని కీర్తించే రచన కూడా ఉంది.

"పశ్చిమ కాశ్మీరాధిపతి ఆరాధ్య దైవంగా వర్ణితమైన పశుపతేశ్వరుని గురించి వ్రాసిన కీర్తన చాలా ఆసక్తి దాయకమైనది."[1] దీక్షితార్ దర్శించినప్పుడే కాశ్మీర్ మహారాజు కూడా అక్కడికి ఆ దేవుని పూజించడానికి వచ్చాడని దీని అర్థమేమో చెప్పలేం. అయితే ఈ కీర్తన ఖాట్మండులోని పశుపతేశ్వరుని గురించి ప్రస్తావిస్తుందనేది

[1] పశ్చిమ కాశ్మీర రాజ వినుతం.

మాత్రం నిశ్చయంగా చెప్పగలం. శ్రీసత్యనారాయణ స్వామిపై మరొక కీర్తన ఉంది. ఇందులో ఆయనను ప్రకాశవంతమైన బదరీనాథ్ లో అధివశించిన దేవునిగా వర్ణించడం జరిగింది.[1] దీనినిబట్టి శంకరాచార్యుని ఆదర్శంగా తీసుకొని చిదంబరనాథయోగి కూడా ఖాట్మాండు, బదరీ ఆలయాలను దర్శించాడనీ, ఈ పర్యటనలో దీక్షితార్ ఆయనను అనుసరించాడనీ, స్పష్టంగా భావించవచ్చు.

ఈ రెండు కీర్తనలు శివ పంతువరాళి రాగంలో రచింపబడటం గమనార్హం. వెంకటమఖి ప్రణాళికలో ఇది 45వ మేళము (ప్రస్తుతం శుభ పంతు పరాళి అంటున్నారు). హిందూస్తానీ సంగీతంలోని మియాంకి తోడి రాగానికి సరిసమానమైనది. ముత్తుస్వామి దీక్షితార్ రోజులలో శివ పంతువరాళి మరుగుపడిన ఉపేక్షితమైన రాగం. ఇప్పటికీ దాని స్థితిలో పెద్దగా మార్పు లేదు. కాని మియాంకి తోడి మాత్రం హిందూస్థానీ సంగీతంలో అతర్వాత జనరంజకమైన రాగాలలో ఒకటి. కనుక ఈ రెండు కీర్తనలలోనూ దీక్షితార్ రాగాన్ని ఉపయోగించడం సముచితం. నిజానికి పశుపతేశ్వరునిపై వ్రాసిన కృతిలో ఆయనా దేవుని శివ- పంతు వరావళి రాగ ప్రియునిగా అభివర్ణించాడు.[2] భగవానుని సమక్షంలో పాడిన భజన గీతాలలో మియాంకి తోడి రాగాన్ని విరివిగా వాడినట్లు ఇది సూచిస్తుంది.

ముత్తుస్వామి దీక్షితార్ రచనలు ఎంతవరకు హిందూస్థానీ సంగీతప్రభావానికి గురి అయ్యాయి అనే అత్యంతాసక్తిదాయకమైన చర్చనీయాంశానికి దారితీస్తుంది. కాని హిందూస్థానీ, కర్నాటక సంగీత బాణీలు విభిన్న లక్షణాలను ప్రదర్శించినప్పటికీ, తొలి వీక్షణలో పరస్పరం విరుద్ధ పద్ధతులుగా కాన వచ్చినప్పటికీ, వాస్తవానికి అవి రెండూ ఒకే సంగీత వ్యవస్థకు చెందిన రెండు శాఖలని ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. రెండూ ఒకే మూలాధారం నుండి ఆవిర్భవించాయి. భారతీయ సంగీత విశిష్టతకు చిహ్నాలైన రాగతాళ భావాలపై ఆధారపడి ఉన్నాయి. రెండు పద్ధతులలోనూ సిద్ధాంత ప్రాతిపదిక ఒకటే. వాటి వ్యక్తీకరణం శాస్త్రం కూడా ఒక్కటే. రెండు పద్ధతులూ వేరువేరు వ్యక్తిత్వాలను వృద్ధి చేసుకున్న మాట నిజమే. కాని వాటి మధ్య ఉన్న భేదం స్వభావరీత్యా ప్రాంతీయ బాణీకి

[1]భా సమాన బదరీ స్థితం.

[2]శుకశౌనకాది ఘోషిత శివపంతువరాలి రాగ ప్రియం.

సంబంధించింది మాత్రమే. వెంకటమఖి కాలంలో ఈ రెండు పద్ధతుల మధ్య భేదాలు అంతగా వ్యక్తం కాలేదు. హిందూస్థానీ సంగీతంలో ఆయన స్వయంగా నిష్ణాతుడు. ఆ బాణీకి చెందిన శిష్యులాయనకుండేవారు. కర్నాటకపద్ధతి అంతకు ముందే అనేక హిందూస్థానీ రాగాలను స్వీకరించి తనలో విలీనం చేసుకుంది. వాటినాధారం చేసుకొని వెంకటమఖి లక్షణ గీతాలను రచించాడు. ఆయన అనంతరం ఆనాటి రాజకీయ పరిస్థితుల ప్రభావం వలన రెండు పద్ధతులు ఒకదానికొకటి దూరమవుతూ స్వతంత్ర మార్గాలలో అభివృద్ధి కాజొచ్చాయి. దీని ఫలితంగా వాటి మధ్య ఉండే వ్యత్యాసాలు మరింత తీవ్రరూపం ధరించాయి. ఈ కారణం వల్లనే గతంలో కర్నాటక సంగీత పద్ధతిలో కలిసిపోయిన హిందూస్థానీ రాగాలు ఈ దశలో తమ స్వతసిద్ధ లక్షణాలలో కొన్నిటిని పోగొట్టుకొని వాటికి బదులుగా కొత్త సంభారాలను సంతరించుకున్నాయి. దీని ఫలితంగా ఒక విధమైన విభిన్నరూపం ధరించాయి. పదునెనిమిదవ శతాబ్ది రెండవ అర్ధభాగంలో దక్షిణ భారత దేశంలో హిందూస్థానీ సంగీత పరిస్థితి ఇది.

ముత్తుస్వామి దీక్షితార్, వెంకటమఖి రూపొందించిన సంప్రదాయంలో పెరిగినవాడు. కాబట్టి హిందూస్థానీ సంగీతం ఎడల ప్రగాఢాభిమానం పెంచుకొన్నాడు. కాశీలో నివసించిన దశలో స్వచ్ఛమైన హిందూస్థానీ సంగీతాన్ని వినే, నేర్చుకునే మహదవకాశం ఆయనకు లభించింది. దానిని ఆయన పరిపూర్ణంగా వినియోగించుకున్నాడు. భగవత్ సేవలోనూ, గురుసేవలోనూ గడిపిన సమయాలలో తప్ప మిగిలిన కాలాన్ని ఆయన సంగీత సాధనకు ప్రత్యేకంగా హిందూస్థానీ రాగాల సాధనకు వినియోగించి వాటిపై గట్టి పట్టు సంపాదించాడు. ఇది ఆయన సంగీతంపై ప్రగాఢ ప్రభావం నెరపింది. ఆయన ఒక్క హిందూస్థానీ రాగాలనే గాక సాధారణంగా తదితర అన్ని రాగాల నిర్వహణలోనూ ఇది ద్యోతకమవుతుంది. కొన్ని హిందూస్థానీ రాగాలు కర్నాటక సంగీతంలో సంలీన మయ్యాయని, అయితే వెంకటమఖి తదనంతర దశలో అవి కొంత మార్పుకు గురి అయ్యాయని ఇది వరకే చెప్పడం జరిగింది. ముత్తుస్వామి దీక్షితార్ రచనలలో అవి తిరిగి స్వతసిద్ధమైన తమ స్వచ్ఛతను, రూపాన్నీ సంపాదించుకున్నాయి. వాటిని తాను కాశీలో ప్రత్యక్షంగా నేర్చుకొనడం ఫలితంగానే ఆయన వాటి నిజమైన హిందూస్థానీ

సంగీత రూప ప్రతిని ప్రదర్శించగలిగాడు. ఉదాహరణకు హిందూస్థానీ సంగీతంలోని సారంగరాగాన్ని "బృందావని" అనే పేరుతో కర్నాటక సంగీతం గ్రహించింది. రాగాల పేర్లలో ఇటువంటి మార్పులు చేయడం అసాధారణ విషయం కాదు. మల్హార్-హిందోళ విషయాన్ని ఉదాహరణగా చెప్పవచ్చు. ఇవి ఆ మధుర గీతాసారానికి భంగం కలుగజేయలేదు. "అంబర కేశ శంభురే" అనే పదాలతో ప్రారంభమయ్యే గీతాన్ని వెంకటమఖి బృందావని రాగంలో రచించాడు. దీని రాగ లక్షణాన్ని ఆయన నిర్వహించిన తీరు ఇది ఆరోహణ- స రి మ ప ని స, అవరోహణ స ని ప మ రి స. కాకళి (తీవ్ర) నిషాదాలను, కొన్ని విశిష్ట సంబారాలను మినహాయిస్తే కర్నాటక సంగీతంలోని మధ్యమావతి రాగ లక్షణం కూడా ఇదే. ఈ గీతంలోని బృందావని రాగ లక్షణం హిందూస్థానీ పద్ధతిలోని సారంగ రాగ లక్షణానికి పూర్తిగా తుల్యమైనది. వెంకట మఖి రోజులు గడిచిపోయాక రెండు భాగాలలోని రాగాల కలయికతో ఏర్పడిన బృందావన-సారంగ రాగం కొన్ని మార్పులకు లోనయింది. సాధారణ (కోమల్) గాంధారాన్ని అరుదుగా ఉపయోగించడం జరిగేది. దానికి పెద్ద ప్రాముఖ్యం లేదు. కాని కాకళినిషాద ప్రయోగం విశిష్ట సంబారాలను వదలివేయడం ఆ రాగ ప్రకృతిలోనే పూర్తి మార్పు తీసుకు వచ్చాయి. దీనినంతనూ ముత్తుస్వామి దీక్షితార్ సరిదిద్దాడు. "రంగపురవిహార", "సౌందరరాజం", "స్వామినాథేన" వంటి అనేక కీర్తనలను ఆయన బృందావన సారంగ రాగంలో రచించాడు. స్వల్ప మాత్రంగా సాధారణ గాంధారాన్ని ఉపయోగించడాన్ని మినహాయిస్తే (దీనిని వదలివేసినా గీత ఖండాలకు ఎటువంటి భంగం కలుగదు కూడా) ఇందులో ఆయన రాగ విన్యాసం ఖచ్చితంగా హిందూస్థానీ సంగీతంలోని సారంగ రాగ విన్యాసంలాగే ఉంటుంది.

దీక్షితార్ చేబట్టిన ఇతర హిందూస్థానీ రాగాలలో యమునా కళ్యాణి (హిందూస్థానీ సంగీతంలో ఇమాం) ఒకటి. ఇందులో ఆయన అనేక గీతాలను రచించాడు. వీటిలో "జంబూ పథే మాం పాహి" అనే గీతాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. రాగభావ సంపదకు, వైభవానికి ఇది సాటిలేనిది. హమీర్ కళ్యాణి రాగంలో ఆయన రచించిన "పరిమళరంగనాథం" మరొక మహోజ్వల రచన. హిందూస్థానీ సంగీతంలో నిర్వహించే రీతిలోనే ఈ రాగాల లక్షణాలను ఇందులో

గాఢానుభూతి కలిగించే రీతిలో వ్యక్తీకరించడం జరిగింది. అయితే ఇందులో కాకతాళీయంగా హిందూస్థానీ సంగీతంలోని కేదారరాగచ్ఛాయలున్నాయని చెప్పవలసి ఉంది. ఈ రాగం కొన్ని శతాబ్దాలుగా దక్షిణ భారత సంగీతంలో అంతర్భాగమై పోయింది. ద్విజవాణి అనే పేరుతో కర్నాటక సంగీతంలో లీనమైన మరొక హిందూస్థానీ రాగం జయ జయవంతి. ఈ రాగంలో దీక్షితార్ రచించిన "చేతస్- శ్రీ బాలకృష్ణమ్" అనే కీర్తన. ఆ రాగ లక్షణాలనన్నింటిని పరిపూర్ణంగా ప్రదర్శించే ఒక వైభవోపేతమైన సంగీత సౌధం. ఈ రాగంలో వెలువడిన రచనల నన్నింటిలోకి ఈ కీర్తనే ప్రగాఢానుభూతి కలిగించేదని భావించడంలో తప్పు లేదు. మాళవ పంచమ అనే రాగం ఉంది. ఇందులో దీక్షితార్ "వాసుదేవము పాస్మహే" అనే కీర్తన రచించాడు. ఇది దక్షిణ దేశంలో కొన్ని మార్పులకు గురి అయినప్పటికీ హిందూస్థానీ పద్ధతిలోని బసంత్ రాగంలాగే ఉంటుంది. ముత్తుస్వామి దీక్షితార్ హిందూస్థానీ రాగాలపై ఉన్న పరిజ్ఞానం ఆయన రచనలను మరింతగా సుసంపన్నం చేసిందని సవివరంగా చెప్పడం జరిగింది. ఉభయ సంగీత శాస్త్ర పద్ధతులలోను తగినంత పరిజ్ఞానం ఉన్న వ్యక్తులు ఆయన రచనలను ఈ దృష్టిలో విమర్శనాపూర్వకంగా అధ్యయనం చేయడం వాంఛనీయమని తోస్తుంది.

దీక్షితార్ హిందూస్థానీ బాణీ నుండి స్వీకరించని రాగాల ననుసరించి చేసిన రచనలలో కూడా ఆ బాణీలు ఆయనకున్న ప్రగాఢ పరిజ్ఞానాన్ని వ్యక్తం చేస్తాయి. అయితే ఆయన సంగీతాన్ని గురించి పరిశీలించేటప్పుడు మరింత సముచితంగా సమాలోచించవలసిన విషయాంశమిది.

ఐదారు సంవత్సరాల పాటు వేదాంత సంగీత శాస్త్ర పరిజ్ఞానాన్ని గ్రహిస్తూ దీక్షితార్ బెనారస్‌లో హాయిగా కాలం గడిపాడు. ఒకనాడు అన్నపూర్ణేశ్వరిని ఆరాధిస్తున్న సందర్భంలో చిదంబరనాథ యోగి, ఆ దేవి ఈ జన్మలో ఆహారమివ్వడమేగాక, మరణానంతరం మోక్షాన్ని కూడా ప్రసాదిస్తుందని, అందుచేత జీవితాంతం ఆమెను ఆరాధించవలసిందని దీక్షితార్‌ను ఆదేశించాడని ఆయన భక్త బృందం నుండి సంప్రదాయ సిద్ధంగా వస్తున్న సమాచారం. ఆ మరునాడు గంగా స్నానానికి వెళుతున్న సమయంలో యోగీశ్వరులు దీక్షితార్‌ను పిలిచి "మనం విడిపోవలసిన సమయం ఆసన్నమైంది. ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులను, సోదరులను చూడాలనే ఆతృత నీకు లేదా?" అని అడిగారు. "ఈ ముక్తి క్షేత్రంలో దేవతలను

ఆరాధిస్తూ మీకు సేవ చేస్తూ యింటిని మరిచిపోయాను" అని దీక్షితార్ సమాధానమిచ్చారు. "కాని నీ తండ్రి గారు నిన్ను నాతో పంపడానికి సుముఖత చూపలేదు. నిన్ను చూడాలని ఆత్రతగా ఉంటారు. నీవు ఇంటికి వెళ్ళి ఆయనకు సపర్యలు చేయవద్దా? గంగానదిలో మూడు, నాలుగు మెట్లు దిగి అక్కడ నీకు ఏమి లభించిందో నాకు చెప్పు" అన్నారు స్వామీజీ.

దీక్షితార్ మెట్లు దిగాడు. ఆశ్చర్యం! అక్కడాయనకు దేవనాగరిలో రామనామ లిఖితమై ఉన్న వీణ దొరికింది. దానినాయన స్వామీజీకిచ్చాడు. "ఇది గంగాదేవి నీకిచ్చిన వరప్రసాదం. నీవు గొప్ప వైణికుడవు, గాయకుడవు అవుతావని" ఆశీర్వదిస్తూ చిదంబరనాథ యోగి ఆ వీణను దీక్షితార్ కందించాడు.[1] ఆ వెంటనే దీక్షితార్‌ను గట్టుమీద వదలి ఆయన స్నానానికని మామూలుగానే గంగానదిలో మునిగాడు. కాని అదే ఆయన అంతిమ క్షణం. ప్రాపంచిక జీవితం నుండి ఆయన ఆత్మ అంతర్ధానమైంది. ఇక మిగిలిందంతా భౌతిక కాయం మాత్రమే. దానిని వెలికి తీసి హనుమాన్ ఘాట్ వద్ద సమాధి చేయడం జరిగింది. తనకత్యంత పూజనీయుడైన గురూజీ అస్తమించడంతో శోకతప్తుడైన ముత్తుస్వామి దీక్షితార్ బెనారస్ (వారణాసి) వదలి ఇంటికి ప్రయాణమయాడు.

---

[1] సుబ్బరామ దీక్షితార్ మనుమడు గురువు అంబి దీక్షితార్ అనే నామాంతరం కల ముత్తుస్వామి దీక్షితార్ కుమారుడు బాలుస్వామి వద్ద ఇప్పుడా వీణ ఉంది.

## అధ్యాయం 3

# తిరుత్తని, కంచి

దీక్షితార్ నెమ్మది, నెమ్మదిగా కాశీ నుండి మనాలి చేరుకొనగలిగాడు. పునరాగమనం ఆయన తల్లి దండ్రులను, సోదరులను ఆనందభరితులను చేసింది. తన వారణాసి జీవితం గురించి ఆయన చెప్పిన కథనం వారిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది. తానార్జించిన వేదాంత పరిజ్ఞానం ఆయనకు వారి గౌరవాభిమానాలను సంపాదించి పెట్టింది. హిందూస్థానీ సంగీతములో ఆయనకున్న ప్రావీణ్యం వారి ప్రశంసకు పాత్రమైనది. కొంతకాలం మనాలిలో అంతా పండుగలూ, శలవులు కాలక్షేపంలా గడచిపోయింది.[1]

అయితే దీక్షితార్ లో మాత్రం మనాలి జీవితం సమకూర్చిన సంతృప్తి ఎంతో కాలం కొనసాగలేదు. తన ఇష్ట దైవం సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అనే విషయం ఆయనకు గుర్తే. ఆ దేవుని అనంత వైభవానుగ్రహాలను గురించి ఆయన తరచు ప్రసంగించే వాడు. అందుచేత ఆ భగవానుని ఆరాధించాలనే కాంక్ష ఆయనలో ఆవిర్భవించినది. మనాలికి దాదాపు ఏబదిమైళ్ళ దూరంలో "తిరుత్తని" అని ప్రసిద్ధి చెందిన స్థలంలో ఒక కొండ శిఖరం పైన సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి అంకితమైన ఆలయం ఉంది. దీక్షితార్ అక్కడికి వెళ్ళాడు. మెట్లెక్కి ఆలయ సముఖంలో నిలిచి ప్రగాఢ ధ్యానావస్థలో మునిగిపోయాడు. ఆస్థితిలో "నా తండ్రి సంతానప్రాప్తి కొరకు ఒక మండలం పాటు బాలాంబికను ఆరాధించాడు. ఆధ్యాత్మిక జ్ఞానార్జన

---

[1]దీనికి భిన్నమైన మరొక అభిప్రాయాన్ననుసరించి ముత్తుస్వామి దీక్షితార్ మనాలి తిరిగి రాకపూర్వమే ఆయన తల్లిదండ్రులు తిరువారూర్‌కు వెళ్ళిపోయారు. ఈరెండింటిలో ఏ అభిప్రాయము సరియైనదైనప్పటికీ ఈ సందర్భంలో వెల్లడించిన కథా సారాంశం యధాతధం.

కోసం నేనెందుకాదేవి కుమారుని ఒక మండలం పాటు పూజించకూడదు?" అని తలపోశాడు. చివరకు సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధిస్తూ, భజనలు చేస్తూ నలభై రోజులపాటు తిరుత్తనిలోనే గడుపడానికి నిర్ణయించుకున్నాడు. షడాక్షరీ మంత్రాన్ని జపిస్తూ భజన చేస్తూ రాత్రింబవళ్ళు ఆలయసముఖంలోనే కూర్చుండిపోయాడు. యాత్రీకులు ఎందరో వచ్చారు-వెళ్ళారు. కాని ఆయన మాత్రం ఆ ఆలయాన్ని ధరించిన కొండలాగే నిశ్చలంగా ధ్యానదీక్షలో నిమగ్నుడై పోయాడు.

నలభైయవ రోజున దీక్షితార్ జీవితాన్ని మలుపు తిప్పినదిగా చెప్పదగిన ఒక సంఘటన జరిగింది. మధ్యాహ్న పూజానంతరం యాత్రీకులలో చాలా మంది కొండదిగిపోయిన తరువాత ఆయన కళ్ళు మూసుకుని షడాక్షరీ మంత్రాన్ని పునశ్చరణ చేస్తున్న తరుణంలో ఒక వృద్ధుడు ఆయన ముందు నిలబడి "ముత్తుస్వామి, నోరు తెరు!" అన్నాడు. దీక్షితార్ కళ్ళు తెరచి ఆధ్యాత్మిక శోభతో వెలుగొందుతున్న ఆ వృద్ధుణ్ణి చూశాడు. "నేనీ ప్రదేశానికి కొత్తవాణ్ణి. ఈయనకు నాపేరేలా తెలిసింది?" అని తల పోశాడు. ఇంతలోనే ఆ వృద్ధుడాయన నోట్లో "ఏదో" వేసి ఇక కళ్ళు మూసుకుని "నేను నీకిచ్చినదేమిటో చెప్పు" అన్నాడు. దీక్షితారావృద్ధుని ఆదేశాన్ని వినమ్రుడై పాటించాడు. కళ్ళు మూసుకుని "అయ్యా! మీరిచ్చింది పటిక పంచదార" అని సమాధానమిచ్చాడు. ఈ మాటలంటూనే మళ్ళీ కళ్ళు తెరిచాడు. కాని ఆయనను ఆశ్చర్యంలో ముంచి అప్పటికే ఆ వృద్ధుడు అదృశ్యమయ్యాడు. ఆయన స్థానంలో ఇరువైపులా వల్లీ, దేవసేనలు పరివేష్ఠించి ఉండగా మయూరాసనాన్నధిష్ఠించిన సుబ్రహ్మణ్యేశ్వరుని రూపం గోచరించింది. ఇంతలోనే ఈ దేదీప్యమానమైన దృశ్యం కనుమరుగవుతూ గర్భాలయంలోనికి అంతర్ధానమైందని జనశృతి. తనముందు వృద్ధుని రూపంలో సాక్షాత్కరించినది శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామియేనని, ఆయన పటిక పంచదార రూపంలో తనకిచ్చింది "జ్ఞాన"సంపద అని, దీక్షితార్ నిర్ణయించుకున్నాడు. ఆయన ఆనందానికి అవధులు లేవు. అది సంగీత రూపంలో పెల్లుబికింది. ఆయన ఈ సందర్భంలోనే శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామిని "గురు గుహ" గా సంభోదిస్తూ ఆయన వైభవాన్ని కీర్తిస్తూ అనేక కీర్తనలు గానం చేశాడు. కనుకనే ఈ కీర్తనా సముదాయం గురు-గుహ లేదా తిరుత్తని కృతులుగా ప్రసిద్ధి చెందాయి.

మొట్టమొదట కీర్తనే "శ్రీనాధునికీ, తదితరులకూ, గురువైన గుహస్వామి వైభవోపేతంగా విరాజిల్లుతున్నాడు", అనే పదాలతో ప్రారంభమవుతుంది.[1] శ్రీవిద్యాదీక్ష వహించిన వ్యక్తికి, ఆ దీక్షా పేరొకటి, ఇవ్వడం జరుగుతుందనీ, చిదంబరనాధస్వామి దీక్షానామం శ్రీనాధానందు అని , ముత్తుస్వామి దీక్షితార్ దీక్షానామం చిదానందనాథ అని, ఇక్కడ చెప్పవలసి ఉంది. ఇక్కడ ఉదాహరితమైన "శ్రీనాథ"అనే పేరు పరోక్షంగా దీక్షితార్ గురువు కుద్దేశితమైనదేనని భావించవచ్చు. ఈ కీర్తన మాయామాళవ రాగం లో ఉంది. శిష్ట సాంప్రదాయ కర్నాటక సంగీతాన్ని నేర్చుకునే విద్యార్ధులకు పురందరదాస్ కాలం నుండే, ఈ రాగంలోనే స్వరశిక్షణ ఇవ్వడం జరుగుతోంది. ఆ తర్వాత "మానస గురు గుహ" అనే సుప్రసిద్ధ కృతి ఆనందభైరవి రాగంలో వెలువడింది. ఇందులో స్వామి వారు అదృశ్యమైన దృశ్యాన్ని మనస్సులో ఉంచుకుని దీక్షితార్ "ఓ! మనసా, గురుగుహ స్వామి రూపాన్ని గురించే యోచించుచు మాయా జనితమైన మానసిక వ్యధలనన్నింటినీ మరచిపో"[2] అంటాడు. పూర్వి రాగంలో ఉన్న ఒక కీర్తన "నేను గురు-గుహ స్వామి దాసుణ్ణి; లేదా నేనే గురు-గుహస్వామిని" అనే వాక్యాలతో ప్రారంభమవుతుంది.[3] భగవత్కృపకు పాత్రుడైన భక్తునికి స్వర్గంలో స్థానం లభించడమేగాక ఒక దాసునిగా భగవంతుని కోరుకోవడం లోని ఆనందానుభూతి అతడికి లభించగలదని వేదాంత శాఖలలో ఒకటి వ్యక్తం చేస్తుంది. తనలోని బ్రహ్మ స్వరూపాన్ని గుర్తించడంలోనే సత్యపూరితమైన, నిరంతరమైన పరమానందం నిబిడీకృతమై ఉందనీ, జ్ఞానమార్గం ద్వారా మాత్రమే దీనిని సాధించడం జరుగుతుందనీ, దీనికి మార్గం సుగమం చేస్తుంది. కాబట్టే భక్తి మార్గం ప్రాముఖ్యం సంతరించు మార్గాన్ని మరొక వేదాంత శాఖ అభిప్రాయం పడుతుంది. ఈరెండవ గాధను ఉదహరించిన మహోన్నత

---

[1] శ్రీనాథా దిగురుగుహో జయతి జయతి

[2] మానస గురు గుహ రూపం భజరే రే।
మాయామయ హృత్తాపం త్యజరేరే।

[3] శ్రీ గురు గుహశ్య దాసోహం -నాచేతు,
చిద గురు గుహ రావాహం!

ప్రవక్త శంకరాచార్యుడు. దీక్షితార్ ఈ శాఖకు చెందిన వాడు.

పైన ఉదహరించిన కీర్తనా వాక్యాల ప్రాముఖ్యాన్ని ప్రశంసాపూర్వకంగా అవగతం చేసుకొవాలంటే ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకోవలసి ఉంది.

అవి ఈ వాద భావనల వ్యక్తీకరణలే లేదా "నేనే గురు-గుహస్వామిని" అనే చరణం "నేనే బ్రహ్మ స్వరూపాన్ని"[1] అనే మహా కావ్యానికి మరో రూపం మాత్రమే. "శ్రీకమలాంబికాయ"[2] అనే కీర్తనలోను, తదితర కీర్తనలలోనూ ఇటువంటి చరణాలు తటస్థిస్తాయి.

ఇక ఈ కృతుల రాగాలకు వస్తే అవి ఈ క్రింది విధంగా ఉంటాయి:

(i) శ్రీనాథుడి గురు-గుహో-మాయామాళవ గౌళ

(ii) మానస గురు-గుహ-ఆనందభైరవి

(iii) శ్రీ- గురున- పాడి

(iv) గురు-గుహాయ - సామ

(v) గురు-గుహదాన్యమ్- బాలహంస

(vi) గురు-గుహశ్య- పూర్వి

(vii) గురు-గుహస్వామిని- భానుమతి

(viii) శ్రీగురు-గుహ మూర్తే- ఉదయరవి చంద్రిక

ఈ కీర్తనలలో ప్రయోగించిన అనేక రాగాలు అపూర్వమైనవిగా పరిగణన అయినవే. వీటిలో పాడి, పూర్వి, ఉదయ చంద్రిక రాగాలు ఈ కీర్తనలలో మాత్రమే జీవిస్తున్నాయి. భానుమతి రాగం అపూర్వమైనదే కాదు, వివాదిమేళలో ఒకటి. ఇందులో వివడి దోషాలను (స్వరసమ్మేళనా విరుద్ధ పద గుచ్ఛాలు) నివారించడంలో గొప్ప నైపుణ్యం ప్రదర్శించాడు. ఆనాటికి దీక్షితార్ వయస్సు ఇరవై అయిదు సంవత్సరాలు మాత్రమే. అయితే అప్పటికే ఆయన వేదాంత జ్ఞానంలోనూ, సంగీత కళా పరిజ్ఞానంలోనూ పరిపక్వతా ఔన్నత్యాన్ని సాధించగలిగాడని ఆయన గురు-గుహ కీర్తనలను

---

[1] అహం బ్రహ్మాస్మి!

[2] శ్రీకమాలాంబికయా కటాక్షితోహం
సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మ స్మి!

పరిశీలిస్తే వెల్లడవుతుంది.

ఈ కీర్తనలలో గమనించవలసిన మరొక లక్షణం కూడా ఉంది. వీటి ఒక్కొక్క దాని సంఖ్య ఎనిమిది. వీటిని ఎనిమిది విభక్తుల (సంస్కృతంలో నామవాచక ప్రత్యయాలు) లో విడివిడిగా ఏదైనా ఒకే దైవం పై మలచడం జరిగింది. ఎనిమిది లేదా అంతకు మించి కీర్తనలను రచించిన సందర్భాలన్నింటి లోనూ, దీక్షితార్ ఈ ఆచారాన్నే పాటించాడు. ఆయనకు భాషపై గల గణనీయమైన పట్టును ఇది చాటి చెపుతుంది.

తిరుత్తనికి దాదాపు ఏబదిమైళ్ళు ఉత్తరంగా తిరుపతి కొండలున్నాయి. ఈ కొండలలోనే శ్రీవెంకటేశ్వరస్వామికి అంకితమైన ఆలయం ఉంది. దీక్షితార్ కుటుంబానికి ఈ స్వామే కులదైవం. ముత్తుస్వామి దీక్షితార్ కాశీనుండి మనాలీకి తిరిగి వచ్చేముందు ఆయన తమ్ముడైన చిన్నస్వామికి ఆకస్మికంగా అంధత్వం ప్రాప్తించిదని, అయితే రామస్వామి దీక్షితార్ చేసిన పూజలకు, ప్రార్థనలకు మెచ్చిన శ్రీవెంకటేశ్వరుని అనుగ్రహం వలన చిన్నస్వామికి తిరిగి చూపు వచ్చిందని వినికిడి. అందుచేతనే ముత్తుస్వామి దీక్షితార్ తిరుత్తని నుండి తిరుపతి వెళ్ళి వెంకటేశ్వరుని ఆరాధించాడు. ఈ సందర్భంలోనే స్వామి వారిని కీర్తిస్తూ వరాళి రాగంలో "శేషాచలానాయకం భజామి" అనే కృతిని గానం చేశాడు. ఇందులో స్వామిని ఆయన "అభి నవ గురు-గుహునకి ఆనంద ప్రదాత" గా అభివర్ణిస్తాడు. ఇక్కడ "అభినవ గురు-గుహ" అనే మాటలు తనను ద్దేశించి వ్రాసుకున్నవే. ఈ విధంగా ఆయన "గురు-గుహ"ను తన ముద్రగా స్వీకరించాడు. తిరుపతి నుండి దీక్షితార్ దానికి సమీపంలో నున్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం కాళహస్తి కి వెళ్ళాడు. ఇక్కడ శివునికి అంకితమైనఆలయం ఉంది. శైవాగమనాలననుసరించి దక్షిణ దేశంలో పంచభూతాలకు ప్రతీకలుగా నిలిచే ఐదు క్షేత్రాలున్నాయి అవి-

1. పృథ్వి (భూమి) - కాంచీపురం
2. ఆప్ (నీరు) - జంబుకేశ్వరమ్ (తిరుచిరాపల్లి)
3. తేజస్ (అగ్ని)- తిరువణ్ణామలై
4. వాయు (గాలి)- కాళహస్తి
5. ఆకాశ (ఆకాశం) - చిదంబరం

ముత్తుస్వామి దీక్షితార్ కాళహస్తిలోని వాయులింగాన్ని ఆరాధించి, ఈ సందర్భంలో ఆ స్వామిని కీర్తిస్తూ, హుసేనీ రాగంలో "శ్రీకాళహస్తీశ" అనే కృతిని గానం చేసాడు.

కాళహస్తి నుండి మనాలి తిరిగి వచ్చిన దీక్షితార్ తన తల్లిదండ్రులకు, సోదరులకు తిరుత్తనిలో తాను పొందిన అనుభూతి గురించి వివిధ ఆలయాలలో తాను రచించిన కీర్తనలను గురించి వివరించాడు. వారందరికీ ఇది ఎంతో ఉత్తేజాన్ని కలిగించింది. "నువ్వు దేవీ వరప్రసాదుడవు. ఆవిడ కృపవల్లనే ఇదంతా జరిగింది. నిజంగా భగవదానుగ్రహానికి పాత్రుడవయ్యావు" అని రామస్వామి దీక్షితార్ కుమారునితో అన్నాడు. ముత్తుస్వామి దీక్షితారు ఆయన రచించిన కృతులన్నిటినీ నేర్చుకొని గానం చేశారు. వాటిని విన్న రామస్వామి దీక్షితార్, "ఇది దివ్య సంగీతం;ఇది చిరకాలం జీవించి ఉంటుంది" అని వ్యక్తం చేశాడు.

కొద్ది కాలంలోనే ముత్తుస్వామి దీక్షితార్ తాను మనాలి వదలి దక్షిణ భారతదేశంలోని సుప్రసిద్ధ ఆలయాలను దర్శించవలసి ఉందని భావించాడు. స్వాభావిక లక్షణం, చిన్నతనంలో పొందిన శిక్షణ, కాశీ జీవితం ఆయనను పరిపూర్ణ దైవ చింతనావ్యక్తిగా తీర్చిదిద్దాయి. తిరుత్తనిలో సుబ్రహ్మణ్య స్వామి సాక్షాత్కారం ఆయన జీవితం లో స్థిరపరిచింది. ఆయన దృక్పథం పూర్తిగా ఆధ్యాత్మికమైనది. అయితే తండ్రి ఆయనకు వివాహం జరిపించిన మాట వాస్తవం. తిరువారూర్ లో చిన్నతనంలోనే చదువుకుంటున్నప్పుడే అందులోనూ ఇద్దరు కన్యలతో ఆయనకు వివాహాలు జరిగాయి. కాని ఆయన మనస్సుపై ఈ ఐహిక లోకాంశాల ప్రాబల్యం లేదు. ఆయన స్ఫూర్తి ఆముష్మికమైనది. భగవత్ సంపర్కము కలిగినది. కనుకనే ఆయన ఒక ప్రక్క కుటుంబంలోనే ఉంటూనే వేరొక ప్రక్క దాని బంధనాల కతీతంగానూ ఉంటూ చివరి వరకు గృహస్థ సన్యాసి జీవితం గడిపాడు. "ఎవడైతే రాగభావం లేకుండా తన విధులను నిర్వర్తిస్తాడో అతడే సన్యాసి, యోగి!" అతడే దీక్షితార్. నాయనారులనే శివ యోగుల, అళ్వారులనే వైష్ణవ యోగుల జీవితాలు ఆయన ముందు సాక్షాత్కరించాయి. వీరు దక్షిణ భారత దేశానికి చెందిన వారు. వీరు ఒక ఒక ఆలయం తరువాత మరొక ఆలయాన్ని దర్శిస్తూ

భగవన్నామ సంకీర్తనలో తమ జీవితాలను వెళ్ళబుచ్చారు. వారిని తనకాదర్శప్రాయులుగా తీసుకొనిన దీక్షితార్[1] తన జీవిత పర్యంతం ఒక ఆలయం నుండి మరొక ఆలయానికి పయనిస్తూ గానం చేసేవాడు. ఆయన మొత్తం జీవిత చరిత్రను ఒక నిరవధిక ఆలయ యాత్రా కథగా క్లుప్తీకరించవచ్చు.

మద్రాసుకు 40 మైళ్ళ దూరంలో దక్షిణ భారతదేశ రాజకీయ సాంస్కృతిక చరిత్రలో అత్యంత ప్రసిద్ధి చెందిన కాంచీపురము ఉంది. అది ఒకప్పుడు పల్లవరాజులకు రాజధాని. అక్కడి శివాలయాలు విష్ణాలయాలు అనేకం ఉన్నాయి. అందుచేతనే అది "ఆలయాల పట్టణం" గా ప్రసిద్ధి చెందినది. కామాక్షీ దేవికి అంకితమైన ఆలయం ఆ నగరంలోనున్న సుప్రసిద్ధ ఆలయాలలో ఒకటి. తొమ్మిదవ శతాబ్దారంభంలో మహిమాదాత్తుడైన శంకరాచార్యుడా ఆలయాన్ని దర్శించి అందులో శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించాడు. ఈ రోజు వరకు కాంచీ నగరంలో నున్న ప్రధాన ఆకర్షణీయ అంశాలలో ఒకటిగా అది ఈనాటికీ నిలిచి ఉంది. దేవీ భక్తుడు శ్రీవిద్యారాధనా మార్గానుసారి అయిన దీక్షితార్‌కి ఎప్పటి నుండో కంచికి వెళ్ళి కామాక్షిని ఆరాధించాలనే ఆరాటం ఉంది. అందుచేత యావత్తు కుటుంబం తాను ఎంతో కాలం నుండి నివసిస్తున్న మనాలి వదలి కంచిలో స్థిరపడింది. ఈ దశలోనే ముత్తుస్వామి దీక్షితార్ కామాక్షి పైనను, ఏకాంబరేశ్వరుని (కంచిలోని శివుని పేరు) పైనను అనేక కృతులను రచించాడు. వీటిలో కమలమనోహరి (వెంకట మఖి దృష్టిలో మనోహరి మాత్రమే) లో రచించిన "కంజదళాయతాక్షి" హిందోళి రాగంలో రచించిన "నీరజాక్షి కామాక్షి" సరస్వతీ మనోహరి రాగంలో (వెంకట మఖి ప్రయోక్తం చేసిన రీతిలో) రచించిన "సరస్వతీ- మనోహరీ", కర్నాటక శుద్ధ సావేరీ రాగంలో రచించిన "ఏకామ్రేశ-నాయికె" కీర్తనలు ఎక్కువ ప్రసిద్ధి చెందినవి. ఏకామ్రేశ్వరుని పై విరచితమైన వాటిలో భైరవి రాగంలో నున్న "చింత యామకంద",

---

[1]అనాశ్రితః కర్మఫలం
కార్యకర్మ కరోతియః ।
స సన్యాసీచ యోగీ చ
ననిరగ్ని చాక్రియః ।

గమకాక్రియ రాగం లోనున్న "ఏకామ్రనాథం భజేహం" అనేవి చాలా సుప్రసిద్ధమైనవి. "చింతయామకంద" అనే కీర్తన స్వామి వారిని పృథ్వీ (భూమి) లింగాకారునిగా వర్ణిస్తుంది. పంచలింగ కీర్తనలలో ఇది ఒకటి. కైలాసనాథ అనే పేరుతో శివునికి అంకితమైన మరో ఆలయం కూడా కంచిలో ఉంది. ఈ దేవునిపై దీక్షితార్ అనేక కృతులను రచించాడు. వేగవాహినీ రాగంలో నున్న "కైలాసనాథం" కాంభోజి రాగంలోనున్న "కైలాసనాథేన" అనే కృతులు వీటిలో చెప్పుకోతగ్గవి. ఈ ఆలయం ఆ తర్వాత నిర్లక్ష్యానికి గురి అయి పాడుపడింది.

కాంచీ పురం ముఖ్యమైన విష్ణు క్షేత్రాలలో కూడా ఒకటి. ఇక్కడున్న వరదరాజ స్వామి ఆలయం దక్షిణ దేశంలో అత్యంత ప్రసిద్ధి చెందింది. తాను కర్నాటక బాణీ లోని సారంగరాగం లో రచించిన "వరద రాజం ఉపాస్మహే" అనే కృతిలో దీక్షితార్ ఈ దేవుని కీర్తిస్తాడు. ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం చెప్పవలసి ఉంది. ఆలయాలు దర్శించి వాటిలోని దేవతా మూర్తులను కీర్తిస్తూ కీర్తనలను రచించుటలో దీక్షితార్ పూర్వ కాలానికి చెందిన శైవ వైష్ణవ యోగులను (నాయన్మారులను, ఆళ్వారులను) అనుసరించినప్పటికీ ఒక ముఖ్య అంశంలో మాత్రం వారితో బేధించాడు. వారు నిబద్ధ పూర్వకంగా తమ మతశాఖకు చెందిన ఆలయాలను మాత్రమే దర్శించారు. అవి శైవ లేదా వైష్ణవ దేవాలయాలయి ఉండవచ్చు. దీక్షితార్ వాటి మధ్య భేదం చూపలేదు. అన్ని దేవాలయాలను దర్శించాడు. వాటిలో దేవతలను గూర్చి గానం చేసాడు. దీనికి గల కారణాన్ని ఆయన అభ్యసించిన అద్వైత వేదాంతంలో కనుగొనవచ్చు. ఈ మార్గాన్ననుసరించి వివిధ దేవతల విభిన్న నామాలతో, రూపాలతో పూజించడం (సగుణోపాసన) ఈ ఐహికలోక బంధం నుండి విముక్తి కావడానికి సృష్టికర్తను ధ్యానించుటలో దృష్టిని లగ్నం చేయుటకు మనస్సు చేబట్టే శిక్షణా గమనంలో ఒక మెట్టు మాత్రమే. నామ, రూప పరిమితులను అధిగమించి (నిర్గుణోపాసన) సర్వాంతర్యామి, సర్వశక్తి సంపన్నుడు అయిన పరబ్రహ్మాన్ని తనలో తాను సాక్షాత్కరింప చేసుకొనడమే అంతిమ లక్ష్యం. ఈ వేదాంతంలో పునీతుడైన దీక్షితార్ శైవ, వైష్ణవ ఆలయాలనన్నింటినీ దర్శించాడు. అందరు దేవతలను ఆరాధించాడు. వారందరి మీద కృతులను రచించాడు. అయితే వాడుకలోనున్న విశిష్ట నామాలలో,

రూపాలలో వారిని వర్ణిస్తూనే వారందరూ నామ రూప రహితుడైన ఒకే ఒక సృష్టికర్త యొక్క వివిధ ప్రతి రూపాలని ఎల్లప్పుడూ నొక్కి వక్కాణించే వాడు. దీక్షితార్ కృతులను సాధారణంగా భక్తి జ్ఞాన మార్గాలు రెండింటి ఆనందదాయక సమ్మేళనాలుగా చెప్పవచ్చు.

ఆ కాలంలో ఉపనిషద్ బ్రహ్మం అనే సన్యాసి కంచిలో నివసించేవాడు. ఆయన గొప్ప వేదాంతి. కొన్ని ఉపనిషత్‌లపైన వ్యాఖ్యలు రాశాడు. ఆయన గొప్ప రామభక్తుడు కూడా. శ్రీరామనామ తారక మంత్రాన్ని శ్రీత్యాగరాజుకి ఉపదేశించిన వాడు ఈయనే. ఈయన రామునిపైన "రామస్తపాడి" అనే యక్ష గానాన్ని రచించాడు. ఇందులోని పాటలు జయదేవుని అష్టపదుల నమూనాలో ఉంటాయి. కంచిలో ముత్తుస్వామి దీక్షితార్ ఖ్యాతి అత్యంత విస్తరించి ఉపనిషద్ బ్రహ్మం దృష్టిలో కూడా పడింది. ఆయన దీక్షితార్‌ని తన మఠానికి ఆహ్వానించి తన పాటలకు సముచిత సంగీత బాణీలను సమకూర్చమని కోరాడు. దీక్షితార్ ఈ పని చేసాడు. కాని దురదృష్టవశాత్తు ఈ సంగీత రచనలిప్పుడు కానరావడం లేదు.

తన వేదాంతాధ్యయనాన్ని పూర్తి చేయడానికి దీక్షితార్ ఈ అవకాశాన్ని వినియోగించుకోదలచాడు. దీనికొరకు ఉపనిషద్ బ్రహ్మాన్ని కలిశాడు. ఆయన దీక్షితార్‌కు ఉపనిషద్‌లను బోధించడమే గాక శ్రీరాముని ఎడ దృఢమైన భక్తి భావాన్ని కూడా కలిగించాడు. శ్రీరాముని మీద దీక్షితార్ రచించిన గీతాలలో ఆయన ప్రభావం స్పష్టంగా ప్రతిబింబిస్తుంది. మంజిరాగంలో తాను రచించిన "రామ చంద్రేన సమాక్షితోహం" అనే కృతిలోఆయన రాముని , లక్ష్మి, సరస్వతి, గౌరీనాథ్‌ల అవతారంగా వర్ణిస్తాడు.[1] మాహురి రాగంలో విరచితమైన "మామ వర రఘువీర" అనే కృతిలో రాముని ఉద్దేశించి "శివుడు తదితరులు నిన్నే బ్రహ్మగా ఉద్ఘోషిస్తున్నారు" అంటాడు.[2] భావార్ధానికి సంబంధించినంత వరకు ఈ వాక్యాలు శ్రీత్యాగరాజ విరచిత "ఎవరిని" అనే కృతిలోని వాక్యాలు ఒకే పోలికలో ఉంటాయి. ఇతర మత విశ్వాసాల వారికున్నట్లే రామభక్తులలో కూడా ఆయన నామమే "తారక

---

[1]రమా భారత గౌరీ రమణ స్వరూపేణ రామచంద్రేణ సంరక్షితోహం!

[2]త్వాహం హరీ శ్యాదయస్త త్వమితి!

మంత్ర"మని ఏవ్యక్తి అయినా, అతడు ఉన్నతుడు లేదా అధముడు అయినప్పటికీ రామనామ జపం చేసినట్లయితే మోక్షాన్ని సాధించడం తథ్యమనే ధృఢ విశ్వాసం నెలకొని ఉంది. దీనిని దృష్టిలో ఉంచుకొనే దీక్షితార్, పైన పేర్కొన్న మాహురి రాగ కీర్తనలో శ్రీరాముని "తన పేరుతోనే పండిత పామర ప్రజలందరినీ పావనం చేసే" మహానుభావుడని వర్ణిస్తాడు.[1] దీక్షితార్ దాదాపు నాలుగు సంవత్సరాలు కంచిలో నివసించాడు. దరిమిలా శ్రీత్యాగరాజస్వామి, కమలాంబల గురించి ఆలోచనలు ముప్పిరిగొనగా కంచి వదలి తిరువారూర్‌కి పయనమయ్యాడు.

[1]పామర పండిత పావన కర నామధేయ గురు మహనుత దానవ రఘువీర.

# అధ్యాయం 4

# తిరువారూర్

తిరువారూర్ వెళ్లాలనే ఆరాటంతో కంచిని వదలిపెట్టిన ముత్తుస్వామి దీక్షితార్ నేరుగా తన లక్ష్య స్థానం వైపు సాగలేదు. దారిలోనున్న ప్రసిద్ధ ఆలయాలను దర్శించుకుంటూ ప్రయాణం సాగించాలని తలపోశాడు. అది ఆయనకున్న ప్రత్యేక స్వాభావిక లక్షణం. ఆయన ముందుగా పంచలింగ క్షేత్రాలలో ఒకటైన తిరువణ్ణామలైను దర్శించాడు. ఇక్కడ అధిష్ఠాన దేవత అరుణాచలేశ్వరుడు. ఆయన అగ్నికి ప్రతిరూపంగా పరిగణించడం జరుగుతుంది. దీక్షితార్ ఆయన ఆలయాన్ని దర్శించాడు. పూజలు చేశాడు. ఆ తర్వాత కర్నాటక బాణీలోని సారంగ రాగంలో తాను రచించిన "అరుణాచలం-నాదం స్మరామి" అనే కృతి ద్వారా స్వామిని కీర్తించాడు.

ఆ తరువాత మరొక పంచలింగ క్షేత్రమైన చిదంబరం దర్శించాడు. ఇక్కడి దేవుని ఆకాశ (ఆకాశం) నికి ప్రతిరూపంగా ఆరాధించడం జరుగుతుంది. ఆ స్వామిని నటరాజని పిలుస్తారు. ఆయన విశ్వాంతరాళ నాట్యానికి ఒక విచిత్రమైన ప్రాముఖ్య ముంది. భారతదేశంలోని అత్యంత ప్రసిద్ధి చెందిన ఆలయాలలో ఇది ఒకటి. దానిపై దీక్షితార్ అనేక కీర్తనలను రచించాడు. కర్నాటక బాణీలో కేదార రాగంలో "ఆనంద నటనా ప్రకాశం" అనే మాటలతో ప్రారంభమయ్యే కృతి వీటిలో అత్యంత ప్రసిద్ధి చెందింది. నాట్యానికనుగుణ్యమైన "సొల్లుకట్టును" తనకు అనుసంధించు కొనడమే ఈ కృతికున్న విశిష్టత. ఆలయంలోని దేవేరి పేరు "శివ కామేశ్వరి". ఆమె పై దీక్షితార్ కళ్యాణి రాగంలో "శివకామేశ్వరిమ్" అనే కీర్తన రచించాడు. నటరాజ స్వామి ఆలయానికి ఆనుకునే శ్రీగోవిందరాజ స్వామికి అంకితమైన వైష్ణవాలయం ఉంది. దీక్షితార్ అనేక కృతులలో ఆయనను కూడా

ప్రారంభమయ్యే కీర్తన, మెచ్చ బౌలిరాగంలో "గోవిందరాజేన" అనే పదాలతో ప్రారంభమయ్యే కీర్తన వీటిలో చెప్పుకోతగ్గవి. మెచ్చబౌలి రాగం చాలా అరుదైంది. వెంకట మఖి గీతాల ద్వారాను, దీక్షితార్ రచించిన ఈ కృతి ద్వారా మాత్రమే దానిని గురించి మనకు తెలుస్తోంది.[1]

తిరువారూర్‌కి తన ప్రయాణం సాగిస్తూ దీక్షితార్ కోలరూన్ నది దాటి వైదీశ్వరన్ కోవెలకు వచ్చాడు. ఆలయంలోని దేవతామూర్తులైన వైద్యనాథ, బాలాంబిక, ముత్తు కుమారస్వాములపై అనేక కృతులను రచించి గానం చేసాడు. బాలాంబికపై అనేక కీర్తనలను రచించాడు. వీటిలో "భజరెరె చిత్త బాలాంబిక" అనేది సుప్రసిద్ధమైనది. కళ్యాణిరాగంలో రచించిన దానిని గురించి ఇది వరకే ప్రస్తావించడం జరిగింది. గుడిలో ప్రధాన దేవతామూర్తి పైన "శ్రీవైద్యనాదం" అనే కృతిని అఠాణా రాగంలో రచించాడు. వైదీశ్వరన్ కోవెల నుండి దీక్షితార్ మయూరం కు ప్రయాణం సాగించాడు. అక్కడ ఒక ప్రాచీన శివాలయం ఉంది. ఇందులో దేవతామూర్తి పేరు మయూరనాధస్వామి, దేవేరి పేరు "అభయాంబ" వారిద్దరిపైన కీర్తనలను రచిస్తూ దీక్షితార్ ఇక్కడ కొన్ని నెలలు గడిపాడు. రాగ లక్షణాల విస్తృత విన్యాసాలకు, తాంత్రిక సిద్ధాంతాలకు అభయాంబపై విరచిత కృతులు ప్రత్యేక విశిష్టతను సంతరించుకున్నాయి. కర్నాటక సంగీతంలోని కేదార రాగంలో విరచిత "అంబికాయః అభయాంబికాయః" అనే కీర్తనలో కుండలీని శక్తిని రగుల్కొలిపే ప్రక్రియ వర్ణితమైనది. ఈ రచనలను గురు-గుహ కృతులలోవలెనే అన్ని విభక్తులలో (ప్రత్యయాలు)ను మళచడం జరిగింది. అవి ఈ క్రింది విధంగా ఉంటాయి-

1. అభయాంబ జగదాంబ- కళ్యాణి
2. ఆర్యమాభాయమామ్- భైరవి
3. గిరిజాయ అజయ- శంకరాభరణం
4. అభయాంబికాయై- యదుకుల కాంభోజ

---

[1]ఆ తర్వాతి కాలంలో జీవించిన మరొక వాగ్గేయకారుడు "దేవి దివ్య" అనే కీర్తన రచించాడు. సుబ్బరామ దీక్షితార్ దీనికి ఈ రాగంలో స్వరకల్పన చేశాడు.

5.అభయాంబికాయః - కేదారగౌళ

6. అంబికాయః అభయాంబికాయః- కేదారం

7. అభయాంబికాయమ్- సహనా

8. దాక్షాయిణీ- తోడి

"శ్రీరాగంలో శ్రీఅభయాంబ నిన్ను" అనే మాటలతో ప్రారంభమయ్యే కీర్తన ఒకటి ఉంది. సాధారణంగా శుభప్రదమైన ముగింపు సందర్భంలోనే ఈ రాగాన్ని గానం చేయడం జరుగుతుంది. దీనినిబట్టి పైన ప్రస్తావించిన ఇతర రచనలను భజనలలో సామూహికంగా గానం చేయాలని, ఈ కీర్తనా రాగం ఆకార్యక్రమానికి శుభకరమైన ముగింపుగా ఉండాలనే దీక్షితార్ ఉద్దేశ్యమని భావించవచ్చు. "మణి ప్రవాళం" అనే పేరుతో సంస్కృతం, తెలుగు, తమిళభాషలలో రచింపబడడం ఈ శ్రీరాగకీర్తన యొక్క గమనించదగిన మరొక విశిష్ట లక్షణం. ఈ తరహాకు చెందిన మరికొన్ని రచనలున్నాయి. కపిరాగంలో వెంకటాచలపతి మీద "వెంకటాచలపతే నిన్ను నామది" అనే మాటలతో ప్రారంభమయ్యే కీర్తన వీటిలో ప్రసిద్ధమైనది.

మయూరం నుండి దీక్షితార్ తిరువారూర్‌కి బయలుదేరాడు. పదహారు సంవత్సరాల క్రితం రామస్వామి దీక్షితార్ అక్కడ నుండే మనాలికి తరలి వెళ్ళాడు. కాని అచ్చటి ప్రజల మనస్సులో ఆయన స్మృతి చెరిగిపోలేదు. గొప్ప సంగీతవేత్త గా, వాగ్గేయకారునిగా, త్యాగరాజస్వామి ఆలయంలో నాదస్వరం కచేరీలను నిర్వహించిన వ్యక్తిగా ఆయన ఎడ వారికి మంచి గౌరవభావం ఉంది. ఇక ముత్తుస్వామి దీక్షితార్ విషయానికి వస్తే ఆయన బాల్యంలోనే ఆ స్థలం వదిలిపెట్టినప్పటికీ ప్రతిభావంతుడైన వాగ్గేయకారుడుగా ఆయన ఆర్జించిన ఖ్యాతి ఆయన కంటె ముందుగానే ఆ స్థలం చేరింది. అందుచేతనే అచ్చటి ప్రజలందరూ, గర్వంగా, ఉత్సాహభరితంగా దీక్షితార్ల పునరాగమనం కోసం ఎదురుచూస్తున్నారు. రామస్వామి దీక్షితార్, ఆయన కుమారులు తిరువారూర్ చేరిన దినం చిరస్మరణీయమైనది. తాము పాత ఇంటిలో ప్రవేశించిన తరుణంలో వారు పొందిన ఆనందం వర్ణనాతీతం. తమకు హృదయ పూర్వక స్వాగతం పలికిన గ్రామస్థుల ఎడ కృతజ్ఞతాభావం వెల్లి విరిసింది. అవధులు లేని ఇటువంటి ఆనందానుభూతితో వారు తిరువారూర్ లో స్థిరపడ్డారు.

తిరువారూర్‌లో ముత్తుస్వామి దీక్షితార్ ను ప్రధానంగా ఆకర్షించింది శ్రీత్యాగరాజస్వామి ఆలయం. దక్షిణ భారతదేశంలోని అత్యంత గంభీరమైన ఆలయాలలో అది ఒకటి. ప్రాచీన సాంప్రదాయాలను అది సంతరించుకొన్నది. సుదీర్ఘమైన పరిమాణాలు కలది. తన ప్రాంగణంలోనే అనేక ఆలయాలను నిలుపుకొన్నది. బయట అత్యంత విస్తృతమైన పవిత్ర సరోవరం. అచ్చటి ఆ దేవతామూర్తులను ఆరాధిస్తూ, వారిపై తాను రచించిన కీర్తనలను గానం చేస్తూ దీక్షితార్ ఎక్కువ కాలం, ఆ ఆలయంలోనే గడిపే వాడు. శ్రీత్యాగరాజ స్వామి, శ్రీకమలాంబ, శ్రీనీలోత్పలాంబ, గణేశ, సుబ్రహ్మణ్యస్వామిలపై ఆయన రచించిన కీర్తనలు ఈ సందర్భంలో వెలువడినవే. అంతేకాదు. తిరువారూర్‌లో నున్న విజయపురంలో వేంచేసి ఉన్న రేణుకాదేవిపై కన్నడ-బెంగళా రాగంలో విరచితమైన కీర్తన, తిరువారూర్‌కి చెందిన ధీవరం యోగిసుందర మూర్తి నాయనార్‌పై తక్కరాగంలో విరచితమైన కీర్తన ఈ తరుణంలో వెలువడ్డాయి.

వీటిలో శ్రీత్యాగరాజస్వామిపై వెలువడినవే అత్యధికం. ఆయనపై విరచితమైన విభక్తి కృతుల సమూహమిది:

1. త్యాగరాజో విరాజితే- అఠాణా
2. త్యాగరాజం భజరే- యదుకుల కాంభోజి
3. త్యాగరాజైన సామాక్షి తోహం- సలకభైరవి
4. త్యాగరాజ నమస్తే- బేగడ
5. త్యాగరాజ ధన్యం - దర్బార్
6. శ్రీత్యాగరాజన్య భక్తో- రుద్రప్రియ
7. త్యాగరాజేకృత్య-కృత్యం- సారంగ
8. వీరవసంత త్యాగరాజ- వీరవసంతం

ఈ సమూహమే గాక శ్రీ త్యాగరాజు మీద ఇంకా అనేక కీర్తనలున్నాయి. గౌళరాగంలో విరచితమైన "త్యాగరాజపాలయ సుమాం" ఆనందభైరవిలో విరచితమైన "త్యాగరాజ యోగ వైభవం" అనే కీర్తనలు అత్యంత ప్రసిద్ధి చెందినవి. శ్రీరాగంలో "త్యాగరాజు- మహోధ్వజారోహ" అనే పదంతో

ప్రారంభమయ్యే మరొక కృతి ఉంది. ఆలయంలో ప్రతి సంవత్సరం జరిగే వసంతోత్సవ కార్యక్రమాన్ని ఇందులో వర్ణించడం జరిగింది. కోవెల ప్రాంగణంలో ప్రధాన ఆలయమే గాక ఐదు శివలింగాలయాలు కూడా ఉన్నాయి. వాటిపై కూడా దీక్షితార్ కృతులను రచించాడు. అవి-

1. అచలేశ్వర- భూపాల
2. హటకేశ్వర- బిల్హారి
3. వాల్మీకేశ్వర- కాంభోజి
4. ఆనందేశ్వర- ఆనందభైరవి
5. సిద్ధేశ్వర- నీలాంబరి

నవవర్ణ కీర్తన అనే మరో కీర్తనావళి ఉంది. దేవిని, కమలాంబను కీర్తిస్తూ వ్రాసిన కీర్తనలవి. కర్నాటక సంగీతంలోని అతి ప్రశస్తమైన సంగీత కళాఖండాల కోవకు చెందినవివి. రాగరూపాలను తీర్చిదిద్దడంలో దీక్షితార్ మేధా వైశిష్ట్యము సాధించిన పరిణతిని వీటిలో చూడవచ్చు. పరిపూర్ణత, ప్రమాణకతలలో వీటి చిత్రీకరణ సాటిలేనిదని చెప్పక తప్పదు. ఇవి వైభవోపేతమైన భారీ నిర్మాణాలు. రాగదేవతలు అధిష్ఠించిన "నాద" దేవాలయాలు. ఇక సాహిత్య విషయానికి వస్తే దేవిని తాంత్రిక పద్ధతిలో పూజించే క్రమంలోకి తొంగి చూసేందుకివి మనకు అవకాశం కల్పిస్తాయి. దేవీ ఆరాధనకు తంత్రాలు చాలా విస్తృతమైన కర్మకాండను సూచిస్తాయి. ఆమె సన్నిధిని చేరడానికి మానవుడు తొమ్మిది వలయాలను దాటవలసి ఉంటుందని చెపుతారు. దీనికి ప్రతివలయంలోనూ ఆమెకు పూజ చేయాలి. ప్రతి వలయానికి ఒక ప్రత్యేక నామం, విశిష్ట దేవతా శక్తులుంటాయి. ఆయా శక్తులు ప్రసాదించే "లబ్ధఫలాలు" కూడా విభిన్నమైనవే. తొమ్మిది "వలయాలను" పూజించడం పూర్తి అయిన తర్వాతనే దేవి తన భక్తులకు పూర్తి లబ్ధ ఫలాలను ప్రసాదిస్తుంది. ఈ విస్తృతమైన కర్మకాండను "నవావరణ పూజ" అంటారు. దీక్షితార్ రచించిన తొమ్మిది కీర్తనలు వివిధ వలయాలలో అధిష్టించిన దేవీ ఆరాధనకు అంకితమైనవి. ఈ తొమ్మిదే కాక ధ్యాన (ప్రార్థన) మంగళ (శుభ

(ప్రదముగింపు) కీర్తనలు కూడా ఉన్నాయి. మొత్తం మీద "నవావరణ" కీర్తనల సంఖ్య పదకొండుకు చేరింది. అవి-

కమాలాంబికే ( ధ్యాన )- తూడి
కమలాంబ సంరక్షతు - ఆనందభైరవి
కమలాంహం భజరే - కళ్యాణి
శ్రీకమలాంబికాయ - శంకరాభరణం
కమలాంబికాయై - కాంభోజి
కమలాంబికాయపరం - భైరవి
కమలాంబికాయస్తవ - పున్నాగవరాళి
శ్రీకమలాంబికాయం భక్తిం - సహనా
శ్రీకమలాంబికే అవ అవ - ఘంటా
శ్రీకమలాంబ జయతి - అహిరి
శ్రీకమలాంబికే - శ్రీరాగ

"ఆవరణ" కీర్తనలలోని మొదటి ఎనిమిది విభక్తులలో ఉన్నాయనే విషయం గమనించవచ్చు. అహిరిరాగంలో నున్న తొమ్మిదవ ఆవరణ కీర్తన ఎనిమిది విభక్తులలోనూ సమకూర్చబడినది.

త్యాగరాజస్వామి ఆలయంలో దేవికి అంకితమైన మరొక మందిరం ఉంది. అందులోని దేవత పేరు నీలోత్పలాంబ. శివుని వివాహమాడాలనే దీక్షతో తపసలో నిమగ్నమైన దేవీ స్వరూపమే కమలాంబ అని తన ప్రభువుని వివాహమాడిన పిమ్మట దేవీ స్వరూపమే నీలోత్పలాంబ అని సాంప్రదాయ గాధ. నీలోత్పలాంబపై దీక్షితార్ గానం చేసిన కృతులివి-

1. నీలోత్పలాంబ జయతే - నారాయణ గౌళ
2. నీలోత్పలాంబ భజరే - రీతి గౌళ[1]
3. నీలోత్పలాంబికాయ - కన్నడ గౌళ
4. నీలోత్పలాంబికాయై - కేదార గౌళ
5. నీలోత్పలాంబికాయః - గౌళ

---

[1]రీతి గౌళ రాగంలో నీలోత్పలాంబపై మరొక కీర్తన ఉంది. కాని అది వేరు, ఈ సమూహానికి సంబంధించినది కాదు.

6. నీలోత్పలాంబాయస్థాన - మాయామాళవ గౌళ
7. నీలోత్పలాంబికాయం - పూర్వగౌళ
8. శ్రీ నీలోత్పలాంబికే - ఛాయగౌళ

ఈ ఎనిమిది గీతాలను సంస్కృత వ్యాకరణంలోని ఎనిమిది విభక్తులలో పొందుపరచడం జరిగింది. ఇందులో ఒక కీర్తన గౌళ రాగంలో ఉంటే మిగతావన్నీ "గౌళ" అనే పదంతో ముగిసే రాగాలలోనే ఉండడం గమనార్హం. ఇవన్నీ గౌళ గుచ్ఛ కీర్తనలుగా ప్రసిద్ధ మయ్యాయి. అంతమాత్రాన వాటి స్వర మేళాల మధ్య సఖ్యత ఉందని భావించరాదు. వీటిలో మూడు కీర్తనలు (5,6,8 సంఖ్యలవి) ఒకే మేళాకు మిగతావి ఇతర మేళాలకు చెందినవి. వాటి రూపాలు మాత్రం భిన్నమైనవి. మాయా మాళవ బృందానికి చెందిన మూడు కీర్తనలు కూడా వాటి స్వరమేళ వస్తువుకు సంబంధించినంత వరకు భిన్నమైనవే. ఈ బృందంలో వాడిన ఛాయాగౌళ, పూర్వగౌళ అనే రెండు రాగాలూ అపూర్వమైనవి. అందుచేతనే ఆ రెండు రాగాలలో విరచితమైన కీర్తనలు అత్యంత విలువైనవి. సాహిత్యవస్తువుకి సంబంధించినంత వరకు ఈ కీర్తనలన్నీ స్తోత్రరూపంలో ఉన్నాయి. తాంత్రిక ప్రకియ జోలికివి పోలేదు.

త్యాగరాజస్వామి ఆలయంలో గణపతికి అంకితమైనవి అనేకం ఉన్నాయి. ఆగమశాస్త్రాల ననుసరించి గణేశునికి పదహారు ప్రతిమూర్తులు, వాటిలో ఒక్కొక్క దానిని ఆరాధించేందుకొక ప్రత్యేక మంత్రం, తంత్రం ఉన్నాయి. దానివలన లభించే లబ్ధి కూడా ప్రత్యేకమైనదే. వీటన్నిటికే తిరువారూర్ ఆలయంలో స్థానముందని వినికిడి. దీక్షితార్ "గణపత్యం" (గణపతి పూజకు సంబంధించిన శాస్త్రం) లో నిష్ణాతుడు. ఆయనకున్న కూలంకష పరిజ్ఞానాన్ని ఆయన గణపతిపై వ్రాసిన కీర్తనలు వెల్లడిస్తాయి. హంసధ్వని రాగంలో నున్న "వాతాపిగణపతిం" గౌళ రాగంలోనున్న "మహాగణపతి రవుతుమాం", శ్రీరాగంలోనున్న "శ్రీమూలాధార చక్ర వినాయక" మల్హారి రాగంలో నున్న "పంచమథంగముఖ గణపతిన" సావేరి రాగంలోనున్న "కరి-కాలభముఖం" అనే కీర్తనలు వీటిలో అత్యంత సుప్రసిద్ధమైనవి.

క్లుప్తంగా చెప్పాలంటే తిరువారూర్ దేవతల మీద దీక్షితార్ రచించిన

కృతులు ఆయన ఇతర స్థలాలలోని ఇతర దేవతలపై తన జీవితంలో వ్రాసిన రచలన్నింటి కంటె ఎక్కువ మొత్తంలో ఉండడమే గాక గుణాత్మకంగా కూడా అత్యుత్తమ శ్రేణికి చెందినవై ఉన్నాయి.

దక్షిణ భారతదేశంలోని ప్రసిద్ధ దేవాలయాలను దర్శించి వాటిలోని దేవతలను కీర్తిస్తూ గానం చేయడం దీక్షితార్ ఆకాంక్ష. అందుచేత తాను తిరువారూర్‌లో స్థిరపడినప్పటికీ తరచు ప్రసిద్ధ ఆలయాలున్న స్థలాలకు వెడుతూ ఉండేవాడు. ఈ దశలోనే ఆయన కావేరి ప్రాంతంలోనున్న స్వామిమలై, మన్నార్ గుడి, నాగపట్టణం, తిరుచిరాపల్లి ఇంకా అనేక స్థలాలను దర్శించి అచ్చటి ఆలయాలలోని దేవతలపై కృతులు రచించారు. స్వామిమలైలో సుబ్రహ్మస్వామికి అంకితమైన గొప్ప ఆలయం ఉంది. ఆ దేవునికంకితమైన ఆరు ప్రముఖ ఆలయాలలో అది ఒకటి. ఈ ఆలయంపై దీక్షితార్ అనేక కృతులు రచించాడు. నలురాగంలోనున్న "స్వామినాథ", బిల్హారి రాగంలోనున్న "శ్రీబాల సుబ్రహ్మణ్య" అనే కీర్తనలు వీటిలో అత్యంత ప్రసిద్ధిచెందినవి. మన్నార్ గుడిలో శ్రీరాజగోపాలస్వామికి అంకితమైన వైష్ణవాలయం ఉంది. ఈ ఆలయస్వామి అయిన శ్రీకృష్ణ ప్రభునికి దేవీ ఆరాధనా సారాంశభూతమైన శ్రీవిద్యతో కల సాంగత్యం వల్లనే ఆయనకు "శ్రీవిద్యారాజగోపాలుడు" అనే పేరు వచ్చింది. ఈ దేవుని కీర్తిస్తూ దీక్షితార్ అనేక కృతులను గానం చేశాడు. సావేరీ రాగంలో విరచితమైన "శ్రీరాజగోపాల" అనే కీర్తన వీటిలో అత్యంత ప్రసిద్ధమైనది. నాగపట్టణం వద్ద అనేక సుప్రసిద్ధ దేవాలయాలున్నాయి. ఇచ్చట నున్న శివాలయంలోని స్వామి పేరు "కాయారోహణుడు", దేవి పేరు నీలాయితాక్షి. వైష్ణవాలయంలోని స్వామి పేరు శ్రీసౌందరరాజు. ఈ దేవతలపై దీక్షితార్ అనేక రచనలు చేశాడు. నీలాంబరి రాగంలో నీలాయతాక్షి పై "అంబనీలాయతాక్షి" అనే కృతి బృందావన సారంగ రాగంలో శ్రీసౌందరరాజుపై రచించిన "సౌందరరాజం ఆశ్రయే" అనే కృతి అత్యంత ప్రసిద్ధి చెందినవి. దేవగాంధార రాగంలో కాయారోహణుని పై రచించిన "కాయారోహణం భజరే" అనే కీర్తనను కూడా ఆయన రచించాడు.

దీక్షితార్‌కి కుమారులు లేరు. ఒక కుమార్తె మాత్రం ఉంది. ఆమెను తిరుచిరాపల్లి నివాసి కొకనికిచ్చి వివాహం చేయడం జరిగింది. కనుక దీక్షితార్ అనేక సందర్భాలలో అక్కడకు వెళ్ళేవాడు. ఆ సమయాలలో అచ్చటి ఆలయాలను

దర్శించడం వాటిలోని దేవతలపై కీర్తనలను రచించడం జరిగేది. తిరుచిరాపల్లి వద్ద జంబూకేశ్వరం (తిరువానక్కావల్) అనే స్థలం ఉంది. పంచలింగ క్షేత్రాలలో ఇది ఒకటి. ఇచ్చట శివుని జలరూపంలో పూజించడం జరుగుతుంది. ఇదివరకే ఉదహరితమైన యమునా కళ్యాణి రాగంలో ప్రసిద్ధి చెందిన "జంబూపతే" అనే కీర్తనను దీక్షితార్ ఇక్కడే రచించాడు. ఆ ఆలయదేవిపై "శ్రీ మాతన్ శివవామంకే" అనే కీర్తనను బేగడ రాగంలో రచించాడు. మాతృభూతేశ్వరునిపై "శ్రీ మాతృభూతం" అనే కీర్తనను కన్నడ రాగంలో ఆలపించాడు. ఆయన రచించిన మహత్తర కళాఖండాలలో ఇది ఒకటి. ఆయన శ్రీరంగం దర్శించి రంగనాధుని మీద, రంగనాయకి పైన అనేక కృతులను గానం చేశాడు. రంగనాయకి రాగంలో విరచితమైన "రంగనాయికం", చాలా అరుదైన మంగళకైసికి రాగంలో నున్న "శ్రీ భార్గవి" అనే కీర్తన వీటిలో అత్యంత ప్రసిద్ధమైనవి. అఖండ కావేరీ తీరంలో నున్న అనేక క్షేత్రాలపై కూడా దీక్షితార్ కీర్తనలను రచించాడు. వీటిలో ముఖారి రాగంలో రచించిన పాహిమాం రత్నా "చలనాయక" మరియు కేదార గౌళ రాగంలో విరచితమైన "నీలకంఠంభజే" అనే కీర్తనలు అత్యంత జనాదరణీయాలయ్యాయి.

దీక్షితార్ కివలూర్ దర్శనం గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. తిరువారూర్‌కి సమీపంలోనే ఉన్న ఈ స్థలంలో అక్షయలింగ రూపంలో వెలసిన ప్రాచీన శివాలయం ఉంది. దీక్షితార్ ఈ ఆలయాన్ని దర్శించిన సంఘటనపై అనుశ్రుతంగా వస్తున్న గాధ ఒకటి ఉంది. ఈ ఆలయస్వామి పై దీక్షితార్ శంకరాభరణ రాగంలో "అక్షయలింగ విభో స్వయంభో" అనే మాటలతో ప్రారంభమయ్యే కృతి రచించి స్వామి వారి ఎదుట గానం చేయడానికి కివలూర్ వెళ్ళాడు. కాని ఆయన ఆలయానికి వెళ్ళే సమయానికి అర్చకుడు పూజా కార్యక్రమాన్ని ముగించి గర్భగుడి తలుపులు మూసివేసి ఇంటికి వెళ్ళడానికి సంసిద్ధుడవుతున్నాడు. ఇది చూచిన దీక్షితార్ ఆయనతో "అయ్యా, స్వామి దర్శనం కోసమే నేను తిరువారూర్ నుండి ప్రత్యేకంగా బయలుదేరి వచ్చాను. కొద్దిసేపు గర్భగుడి తలుపులు తీసి ఉంచండి" అని ప్రార్థించాడు. దానికా అర్చకుడు విరసంతో "అయ్యా, మీరు కావాలనుకుంటున్న దర్శనం రేపైనా చేసుకోవచ్చు. స్వామివారెక్కడికే

పారిపోవడం లేదు" అని సమాధానం చెపుతూ ఇంటికి బయలుదేర బోయాడు. దీక్షితార్ ఈ సమయంలోనే అక్కడ కూర్చుని కృతిని పాడడం ప్రారంభించాడు. ఆయన సంగీతం ఆ గ్రామస్థులనాకర్షించింది. దానిని వినడానికి పెద్దగుంపు అక్కడికి చేరారు. విస్మయం, కుతూహలంతో ఇదంతా చూస్తున్న అర్చకుడు కూడా అక్కడే ఉండి పోయాడు. దీక్షితార్ పాట చివరికొచ్చే సరికి చూడండి-గర్భగుడి తలుపులు తమంత తాము తెరుచుకున్నాయి. స్వామి పరిపూర్ణ స్వరూపం ప్రత్యక్షమైంది. ప్రజలు ఆశ్చర్య చకితులయారు. నిశ్చేష్టుడైన అర్చకుడు దీక్షితార్ పాదాల మీద పడి క్షమాభిక్ష వేడాడు. ఆయనను దీవించి, స్వామిని పరిపూర్తిగా దర్శించుకొని దీక్షితార్ తిరువారూర్‌కి తిరిగి వచ్చాడు.[1] ఆధ్యాత్మిక చింతా గరిష్టుడైన వాగ్గేయకారునిగా, దీక్షితార్ ఖ్యాతి నలుమూలలకు విస్తరించింది. ధర్మకర్తలు, సంపన్నులు తమకు సంబంధించిన ఆలయాలకు ఆహ్వానించి ఆయన చేత ఆయా దేవాలయాల దేవతామూర్తులపై కీర్తనలను రచింపజేయడానికి ఒకరితోనొకరు పోటీ పడేవారు. తిరువారూర్ దగ్గరునున్న కులికరై (గర్భతీర్థ) మిరాసీదారైన వైద్యలింగ మొదలియార్ వీరిలో ఒకడు. ఇచ్చట విశ్వేశ్వరుని కంకితమైన శివాలయంతోపాటు విశాలాక్షి, అన్నపూర్ణ ఆలయాలున్నాయి. దీక్షితార్, మొదలియార్ ఆహ్వానాన్ని మన్నించి ఈ దేవతలపై కీర్తనలు రచిస్తూ ఇచ్చట కొన్ని రోజులు గడిపాడు. కాంభోజి రాగంలో విరచితమైన "కాశీవిశ్వేశ్వరా", సామరాగంలోని "అన్నపూర్ణా" అనే కీర్తనలు వీటిలో ప్రసిద్ధి చెందినవి. ఈ రచనలతో ఎంతగానో సంతుష్టి చెందిన మిరాసీదార్ కనకాభిషేకం వంటి విశిష్ట గౌరవ పురస్కారాలతో ఆయనను సత్కరించాడు. ఈ తరుణంలోనే మిరాసీదార్‌ను కీర్తిస్తూ దీక్షితార్ ఒక కీర్తన రచిస్తే బాగుంటుందనే సూచన వచ్చింది. కాని దీక్షితార్ దీనికంగీకరించలేదు. తనకుగానీ, మొదలియార్‌కి గానీ అది క్షేమకరం కాదని ఆయనను రక్షించమని భగవంతుని ప్రార్థించగలనని అది అంతకంటె విలువైనదని చెప్పాడు. ఆ తర్వాత పదునాలుగు రాగాలలో "శ్రీ విశ్వనాథం" అనే తన సుప్రసిద్ధ

---

[1]దీక్షితార్, త్యాగరాజులకు సంబంధించిన మహిమల గురించి అనేక కథలున్నాయి. అయితే నా గురువు గారైన అంబిదీక్షితార్ తమ కుటుంబంలో సాంప్రదాయకంగా వినవస్తున్నవని నాకు చెప్పిన వాటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

రాగమాలికను రచించాడు. ఇందులోని చివరి అంశంలో పరమాత్మను "భాగ్యశాలి అయిన వైద్య లింగం యొక్క రక్షకుని" గా వర్ణించాడు.[1]

దీక్షితార్ ఎన్నడూ భోగభాగ్యాలను ఆశించలేదు. అనుభవించలేదు. క్షుద్బాధను తట్టుకునేందుకు తరచు అనేక బాధలు పడవలసి వచ్చేది. ఈవిషయాన్ని గుర్తుంచుకొంటే ఈ సందర్భంలో ఆయన తీసుకున్న నిర్ణయం ఎంతగా హర్షణీయమో అవగతమవుతుంది. ఆయన పడిన బాధల గురించి అనేక గాథలున్నాయి. వీటిలో ఒక గాథను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. ఈ దశకు సంబంధించింది కాబట్టి కుటుంబంలో అనుశ్రుతంగా వస్తూ బలీయమైన సాక్ష్యాధారరూపం ధరించినది కాబట్టి దీనినిక్కడ ఉటంకించడం సందర్భోచితంగానే ఉంటుంది. ఇంట్లో పచారీ సరుకులు అడుగంటిన రోజులున్నాయి. ఒక రోజున ఆవేళ భోజనానికి కూడా అవి సరిపోయేటట్టు లేవు. వంట గదిలోని స్త్రీలు ఇబ్బందిలో పడ్డారు. దీక్షితార్, శిష్యులకు తన కీర్తనలను నేర్పడంలో నిమగ్నమై ఉన్నాడు. వారిలో దాసి కమలం అనే స్త్రీ కూడా ఉంది. ఆమెకు స్థానిక ఆలయంలో మిరాసి హక్కులున్నాయి. దీక్షితార్ భార్య ఆమెను లోపలికి పిలిచి "కమలా! వంటకు బియ్యంలేవు. మేమంతా క్షుద్బాధనెదుర్కొనవలసిన పరిస్థితి వచ్చింది. నువ్వేమైనా సహాయం చేయగలవా?'' అని అడిగింది. దానికి కమలం ''అమ్మా! నేనిక్కడుండగా మీరెందుకు గాభరా పడుతారు? నా బంగారు గాజులను తాకట్టు పెట్టి ఆ వచ్చిన డబ్బుతో మీకవసరమైన సరుకులనన్నింటినీ నేను కొంటాను'' అని చెప్పింది. ఈ మాటలు దీక్షితార్ చెవిని పడ్డాయి.

---

[1]క్రీ.శ. 1892లో ఓరియంటల్ మ్యూజిక్ ఇన్ యూరపియన్ నొటేషన్ అనే గ్రంథం వెలువడింది. దాని సంపాదకుడైన చిన్నస్వామి మొదలియార్ ఈ క్రింది అధోజ్ఞాపికతో ఈ రాగమాలికను ప్రచురించాడు.

"రాగమాలికను వైద్యలింగ మొదలియార్ ప్రోద్బలంపై రచించడం జరిగింది. మొదలియార్ కులికరై మిరాసిదారు; విద్వత్సంపన్నుడు. దీక్షితార్ అసామాన్య ప్రతిభను గుర్తించి ఆయనను కనకాభిషేకం తో సత్కరించిన సౌజన్యుడు., అయితే తనను కీర్తిస్తూ ఒక కీర్తన రచించమని దీక్షితార్ ను ప్రార్థించాడు. కాని త్యాగరాజు వలె నరస్తుతిని గర్హించిన ఆ వాగ్గేయకారుడు భూపాలుని సంక్షేమాన్ని అర్థిస్తూ మాత్రమే స్థానిక దేవతలను కీర్తిస్తూ కీర్తనలు రచించాడు."

నాశిష్యులను నేను పోషించే బదులు వారే నన్ను పోషించే దుస్థితి వచ్చిందని బాధ పడ్డాడు. కమల బయటకు రాగానే ఆమెను పిలిచి, "కమలం! నువ్వు చేస్తున్నదేమిటి? నీ గాజులు మమ్మల్ని కొద్ది రోజులు మాత్రమే పోషిస్తాయి. ఆ తర్వాత భవిష్యత్తు మాటేమిటి? మమ్మల్ని జీవితాంతం పోషించే మాటయితే నీకు నీ నగలలో మిగిలిదేముంటుంది? మనందరికి తిండి పెట్టే వాడు ఆ భగవంతుడే. నేనే కనుక శ్రీత్యాగేశుని నిజమైన భక్తుణ్ణి అయితే ఈ అవసర సమయంలో ఆయన నన్ను విడచి పుచ్చడు. కనుక నీ నగలను తాకట్టు పెట్టవద్దు. శిష్యులకు సంగీతం చెప్పుకోవడం ద్వారా బ్రతుకు భారం మోస్తున్నానని అనడానికి ఎవరికీ అవకాశం ఇవ్వవద్దు". ఈ మాటలనేసి దీక్షితార్ పూజ చేసుకునేందుకు మామూలుగా ఆలయానికి వెళ్ళిపోయాడు. ఆ రోజునే త్యాగరాజు మీద యదుకుల కాంభోజి రాగంలో "త్యాగరాజం భజరేరే చిత్త" అనే గీతాన్ని రచించాడు. భక్తితో, భావావేశంతో, ఆలయ ప్రాంగణంలో దానిని ఆలపించి ఇంటికి తిరిగి వచ్చాడు. ఒక విస్మయానందకర విషయం ఆయన కోసం ఎదురుచూస్తోంది. జరిగిందిది- తంజావూరు మహారాజు ఆస్థానంలోని ఒక ఉన్నతాధికారి ఆరోజు తిరువారూర్ దర్శించవలసి ఉంది. అందుచేత ఆయన బృందానికవసరమైన పచారీ సామాగ్రిని స్థానికాధికారి భారీ ఎత్తున సేకరించి ఉంచాడు. కాని ఆరోజు ఉదయమే తన తిరువారూర్ కార్యక్రమం రద్దయినట్లు ఉన్నత పర్యవేక్షణాధికారి నుండి స్థానిక అధికారికి వర్తమానం అందింది. ఈ పరిస్థితిలలో తన కార్యాలయంలో నిరుపయోగంగా పడి ఉన్న ఆ సామాగ్రిని యోగిపుంగవుడైన వాగ్గేయకారునికి పంపడం సముచితం కాగలదని స్థానిక అధికారి తలపోశాడు. ఈ విషయం తెలియగానే దీక్షితార్ "నన్ను త్యాగరాజ స్వామి" రక్షించాడు అని వ్యాఖ్యానించి సలాక భైరవి రాగంలో "త్యాగరాజేన సంరక్షితోహం" అనే కీర్తనను రచించాడు.

స్థానికాలయానికి చెందిన దాసీలలో కమలం ఒకతె. ఆమెకు దేవతామూర్తి ముందు నాట్యం చేసే మిరాసీ హక్కు ఉంది. ఆమె లాంఛనప్రాయంగా ఆస్థానాన్ని అలంకరించవలసిన సమయం ఆసన్నమైంది. ఆసందర్భంలో ఆమె తొలిసారిగా రంగస్థలి నధిరోహించి ఒక నృత్య ప్రదర్శన (అరంగేట్రల్)

ను ఇవ్వవలసి ఉంది . దానికవసరమైన కీర్తనలను రచించవలసినదని దీక్షితార్‌ను కోరడం జరిగింది. దీనికాయన అంగీకరించాడు. కాని రచనలన్నీ భగవంతుని ఉద్దేశించి మాత్రమే ఉంటాయని స్పష్టం చేశాడు. ఈ సందర్భంలో ఆయన రచించిన వాటిలో త్యాగేశుడి మీద తోడి రాగంలో విరచించిన "రూపము సుచి" అనే పద వర్ణం, శ్రీరంజని రాగంలోని నీసాటి దైవ మెందులేడని అనే దరువు లభ్యమవుతున్నాయి. ఈ నృత్య కార్యక్రమానికి హాజరైన వారిలో పొన్నయ్య "తంజావూరు సోదరులు"గా ప్రసిద్ధులైన వడివేలు, ఆయన సోదరులు కూడా ఉన్నారు. కమలం నృత్య ప్రదర్శన వారినెంతగానో ముగ్ధులను చేసింది. అందుచేత కార్యక్రమానంతరం వారు దీక్షితార్ ను కలిసి తమను శిష్యులుగా స్వీకరించమని తంజావూరు వచ్చి స్థిరపడి తమకు సంగీత భిక్ష పెట్టమని ప్రాధేయపడ్డారు. కొంత కాలంపోయిన తరువాత తానీ పని చేయగలనని దీక్షితార్ వారికి వాగ్దానం చేశాడు.

త్యాగరాజస్వామి ఆలయం భటవృత్తి కారులలో తంబియప్పన్ ఒకడు. శుద్ధ మద్దలం వాయించడంలో నిష్ణాతుడు, దీక్షితార్‌కి ఆప్త శిష్యుడు. అతడికి ఆకస్మికంగా కడుపులో పోట్లు వచ్చాయి. వైద్యులు వాటిని తగ్గించ లేకపోయారు. జ్యోతిష్యశాస్త్రంలో కూడా నిపుణుడైన దీక్షితార్ అతడి జాతకం తెప్పించుకొని పరిశీలించి "గురు" గ్రహ బాధవలన అతడికీ దుస్థితి కలిగిందని దాని నివారణకు ఆ గ్రహాన్ని ఉపశమింప చేయవలసి ఉందని గ్రహించాడు. ఇందులో వేదమంత్రాలకు తావులేదు. ఇక "గురు" గ్రహం మీద ఒక కీర్తన రచించడానికి పూనుకొనడమే దీనికి తగిన మార్గమని ఆయన భావించాడు. ఈ విషయాన్ని ఇంకా తరచి చూసి అన్ని గ్రహాల మీద కీర్తనా సముచ్చయాన్ని రచించడం మంచిదని మానవాళి శ్రేయస్సు కిది మేలు చేస్తుందని ఆయన తలపోశాడు. అందుచేత ఈ క్రింది విధంగా ఆయన నవ గ్రహ కృతులను రచించాడు.

1. "సూర్యమూర్తే " సౌరాష్ట్ర రాగంలో సూర్యుని మీద విరచితం
2. "చంద్రంభజే" అసావేరీ రాగంలో చంద్రుని మీద విరచితం
3. "అంగారకం" సురటి రాగంలో అంగారక గ్రహం మీద విరచితం

4. "బుద్ధ మాశ్రయామి" నటకురంజి రాగంలో బుధగ్రహంపై విరచితం
5. "బృహస్పతే" అఠాణా రాగంలో బృహస్పతి గ్రహంపై విరచితం
6. "శుక్ర భగవంతం" ఫరజురాగంలో శుక్రగ్రహంపై విరచితం
7. "దివాకరతనూజం" యదుకుల కాంభోజి రాగంలో శనిగ్రహంపై రచన
8. "స్మరం యాహం" రామమనోహరి రాగంలో రాహుగ్రహంపై విరచితం
9. "మహా శురం చమరాన్" రాగంలో కేతు గ్రహంపై సాగిన రచన.

"బృహస్పతే" అనే కృతిని అనుదినం గానం చేసిన తంబియప్పన్ అనారోగ్య స్థితి నుండి కోలుకున్నాడని జనశృతి. దీక్షితార్ రచనలలోని అత్యంత జనాదరణీయమైన వాటిలో ఈ "నవగ్రహ" కృతులు కూడా ఉన్నాయి. అవి సంస్కృత సిద్ధాంత గ్రంథాలలోని నిర్వచితమైన జ్యోతిశాస్త్రం లో ఆయనకున్న లోతైన పరిజ్ఞానాన్ని ప్రస్ఫుటం చేయడమే గాక సంగీత శాస్త్ర రచనలుగా కూడా వాటి విలువ అత్యున్నత శ్రేణికి చెందినవి. విన్యాస దృష్టిలో ఈ కృతులు దీక్షితార్ రచనలలో ఉత్తమ శ్రేణికి చెందినవి అవడమే గాక, తాళ నిర్మాణ దృష్టిలో కూడా వీటికి సులది సప్త తాళ చిత్రాన్ని ప్రదర్శించిన ప్రత్యేక విశిష్టత ఉంది. కర్నాటక సంగీతంలో తాళ పద్ధతి సప్తతాళ పునాది మీద నిర్మితమైనది. అవి ధృవ, మత్స్య, రూపక, ఝంప, త్రిపుట, ఆట, ఏక. ఈ రచనలలోని మొదటి ఏడు కృతులు సప్త తాళాల లోను వాటి వరుసక్రమంలో కూర్చబడడం వాటికున్న విశేషం.

తిరువారూర్ లో నివసిస్తున్న దశలో క్రీ.శ. 1857లో దీక్షితార్ కుటుంబంలో పెద్ద మార్పు వచ్చింది. ఆ ఏడాది తొలి దశలో దీక్షితార్ తల్లిదండ్రులిద్దరూ మరణించారు. ఇది కుటుంబంలో పెద్ద వెలితి అయింది. ఈ దశలోని కొంతమంది పేరొందిన పెద్దలు మధురై నుండి వచ్చి తమ నగరానికి విచ్చేసి మీనాక్షి దేవిని, సుందరేశ్వరుని కీర్తిస్తూ గానం చేయమని దీక్షితార్‌ను ఆహ్వానించారు. ఆవిధంగా చేయడానికి తానెంతో ఆతురతతో ఉన్నానని, కాని అది కొంతకాలం అయ్యాక గానీ జరుగదనీ దీక్షితార్ సమాధానమిచ్చాడు. దానికి వారు ఆయన కీర్తనలను తమకు నేర్పేందుకు తన సోదరులైన చిన్నస్వాములనైనా మధురైకు పంపమని దీక్షితార్‌ను

ప్రార్థించారు. తన సోదరులు దీనికి సుముఖంగా ఉన్నారని తెలుసుకొనిన తరువాత మధురై నుంచి వచ్చిన ఆగంతుకులతో వెళ్ళడానికి, దీక్షితార్ వారికి అనుమతి ఇచ్చాడు. తన సోదరుల విష్క్రమణ తరువాత దీక్షితార్ ఒంటరితనం అనుభవించాడు. ఆ తరుణంలోనే తంజావూరు రమ్మని పొన్నయ్య వడివేలు యిద్దరూ చేసిన విజ్ఞప్తి గుర్తుకు వచ్చింది. అక్కడికి వెళ్ళడానికే నిర్ణయించుకున్నాడు.

# అధ్యాయం 5

# తంజావూరు

ముత్తుస్వామి దీక్షితార్ తంజావూర్ తరలి వెళ్లే తలంపుతో ఉన్నారని తెలుసుకొనిన, పొన్నయ్య, ఆయన సోదరులైన చిన్నయ్య , శివానందం, వడివేలు చాలా ఆనందపడ్డారు. ఆయన తన కుటుంబంతో నివసించడానికి పశ్చిమ వీధిలో తమ ఇంటికి ఎదురుగానే ఉన్నభవంతి (ప్రస్తుతం శంకర మఠం స్వాధీనం చేసుకొంది)ని ఏర్పాటు చేశారు. ఆయన రాక పట్టణం లోనూ, పరిసర ప్రాంతాల లోనూ గణనీయమైన మేరకు ఉత్సాహన్ని రేకెత్తించింది. ఆయనను సందర్శించి గౌరవించి ఆహ్వానించిన మొట్టమొదటి వారిలో గొప్ప స్థానిక సంపన్నులలోని పండితులు, సంగీత కళాకారులు ఉన్నారు. వాగ్గేయకారుడైన శ్యామశాస్త్రి వారిలో ఒకరు. ఆయన అదే వీధి చివర అగ్రహారంలో కామాక్షి అమ్మ గుడి వెనుక నివసించేవారు. వారిద్దరూ పూర్వ మిత్రులు. దేవీదీక్షారాధకులు. తంజావూరులో వారిద్దరూ తరచు కలుసుకొని మార్మికమైన, తాంత్రిక సిద్ధాంతాలను గురించి చర్చించేవారు. సంగీతానికి సంబంధించినంత వరకు మాత్రం ఈ ఇద్దరు వాగ్గేయకారులు భిన్న మార్గాలననుసరించారు. శ్యామశాస్త్రి తాళానికి ఎక్కువ ప్రాముఖ్యమిస్తే దీక్షితార్ రాగానికెక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు. శ్యామశాస్త్రి కీర్తనలు చాలా వరకు ప్రసిద్ధి చెందిన ప్రజారంజకమైన రాగాలలో ఉంటే, దీక్షితార్ కీర్తనలు ఆనాటికి తెలిసిన రాగాలన్నింటిలోను ఉన్నాయి. అందుచేతే కొన్ని అపూర్వ రాగాలు ఆయన కృతులలోనే జీవిస్తాయి. ఈ విభేదాలున్నప్పటికీ శ్యామశాస్త్రి, దీక్షితార్ రచనలను ఎంతగానో అభిమానించే వాడు. తన కుమారుడైన సుబ్బయ్య శాస్త్రిని దీక్షితార్ వద్దకు సంగీత శిక్షణకు పంపేవారంటే ఈ అభిమానం ఎంతగా ఉండేదో అవగతమవుతుంది. సుబ్బయశాస్త్రి కూడా

చాలా ఉన్నతస్థాయి కృతులు రచించిన వాగ్గేయకారుడయ్యాడు. అవి శ్యామశాస్త్రి లయ సౌందర్యాలను, దీక్షితార్ రాగ సంపదను ప్రతిబింబిస్తాయని చెప్పవచ్చు. ఈ దశలోనే మధురై తరలిపోయిన చిన్నస్వామి, తన సోదరుడైన ముత్తుస్వామి దీక్షితార్‌ను చూడడానికి అప్పుడప్పుడు తంజావూరు వచ్చేవారు. అటువంటి సందర్భాలలో వారంతా శ్యామశాస్త్రితో కలసి సంగీత కచేరీలలో పాల్గొనడం జరిగేది. ఈ సమావేశాల గురించి ఎంతో ఆసక్తికరమైన విచిత్రపూర్వక సమాచారం ఉంది. రామస్వామి దీక్షితార్ శ్రీరంజని రాగంలో "స్వామి నిన్నే కోరి" అనే చౌక-వర్ణాన్ని రచించాడు. ఇందులోని చరణంలో ఒక స్వర ప్రస్తావన మాత్రమే మిగిలింది. మిగతావి నశించి పోయినట్లున్నాయి. అంత మంచి రచనను అది అసంపూర్తిగా ఉన్న కారణాన కాలగర్భంలో కలసి పోనివ్వరాదని శ్యామశాస్త్రి అభిప్రాయ పడ్డారు. కనుక తానే స్వరమాలలోని రెండవ చరణాన్ని రచించి ముత్తుస్వామి దీక్షితార్‌ను చిన్నస్వామిని ఆవర్ణాన్ని పూర్తి చేయమని అభ్యర్థించారు. దీనిననుసరించి చిన్నస్వామి మూడవ చరణాన్ని ముత్తుస్వామి దీక్షితార్ చివరిదైన నాల్గవ చరణాన్ని రచించారు.[1] తంజావూరులో శ్యామశాస్త్రి , ముత్తుస్వామి దీక్షితార్ కలయిక దక్షిణ భారతీయ సంగీత చరిత్రలో ఒక ముఖ్య అధ్యాయమని చెప్పవచ్చు.

తంజావూర్‌లో అనేక ఆలయాలున్నాయి. బృహదీశ్వర నామాంకితుడైన శివునికి, బృహన్నాయకి అనే పేరు గల ఆయన దేవేరికి అంకితమైన సుప్రసిద్ధ ఆలయం వీటిలో ఒకటి. తమ అధికారం ఉచ్ఛ దశలోనున్న స్థితిలో చోళ చక్రవర్తులీ ఆలయాన్ని నిర్మించారు. ఇది అత్యంత ఘనపరిమాణ కొలతలు కలది. అత్యుత్తమ వాస్తు కళా నిర్మాణం. దీక్షితార్ దీనిని, తంజావూర్‌లోని ఆలయాలను దర్శించి వాటిలో దేవతామూర్తులను స్తుతిస్తూ అనేక కృతులను రచించాడు. ఈ కీర్తనలలో అధిక భాగం బృహదీశ, బృహన్నాయకలపై విరచితాలు. వీటిలో కొన్ని సుప్రసిద్ధ రాగాలలో ఉన్నప్పటికీ ఎక్కువ భాగం వెంకటమఖి విరచిత వివడి మేళ రాగాలలోనూ ఉన్నాయి. దీనిని మరికొంత వివరించ వలసి ఉంది.

[1]మద్రాస్ మ్యూజిక్ అకాడమీ వారు ప్రచురించిన "సంగీత సాంప్రదాయ ప్రదర్శిని" అనే గ్రంథం తమిళ ప్రతిలోని రెండవ భాగము 504వ పేజీలో ఈ విషయం ప్రస్తావితమైంది.

ఆనాటికి కూడా వెంకటమఖి తీర్చిదిద్దిన 72 మేళాల పథకం సంగీత కళాకారులకు అగమ్య గోచరంగానే ఉండేది. కొద్దిమంది విద్వాంసులకు మాత్రమే అది అందుబాటులో ఉండేది. వెంకటమఖికి పూర్వం వాడుకలోనున్న రాగాల సంఖ్య 150 కంటె తక్కువేనని, వీటిలో వివిధ రచయితల వ్రాతలను బట్టి మేళ రాగాలని పేరొందిన వాటి సంఖ్య 15 నుండి 19 వరకు మాత్రమే ఉండేదని ఇక్కడ గుర్తుంచుకోవాలి. అంతేగాక సరిపోలిక లేని అనేక రాగాలను ఒకే మేళానికి చెందిన జన్యరాగాలుగా వర్గీకరించడం కూడా జరిగింది. మేళాల, జన్యరాగాల వర్గీకరణ వాటి కాధారభూతమైన మైన స్వరాలననుసరించి జరగాలనే సూత్రాన్ని మొట్టమొదట వెంకటమఖే ప్రతిపాదించారు. అంతేగాక ఈ సూత్రాన్ని అనుసరించి 72 మేళ పథకాన్ని రూపొందించారు. ఆచరణలో ఆయన ఊహించిన రీతిలో అవి లేవు. అవి ఆయన రూపొందించిన పథకము యొక్క వక్రజీవులు మాత్రమే. అందుచేతనే తంజావూరు నేలిన తులజా ప్రభువు తాను 1735 ప్రాంతంలో వ్రాసిన "సంగీత సారామృతం" అనే సిద్ధాంత గ్రంథంలో వెంకటమఖి మేళాలు ప్రాచుర్యం పొందలేదని వాడుకలో నున్న రాగాలకు సంబంధించినంత వరకు 21 మేళాలు చాలునని వ్యక్తం చేయడం విస్మయకరం కాదు. కనుక ఆయన ఈ మేళ రీతులననుసరించే వర్తమాన రాగాల లక్షణాలను పేర్కొన్నారు.

తదుపరి కాలక్రమంగా పరిస్థితిలో మార్పు వచ్చింది. వెంకటమఖి పథకంపై పరిజ్ఞానం విస్తరించడంతో 72 మేళ భావన బలపడజొచ్చింది. నూతన మేళాలకు వెంకటమఖి లక్షణ గీతాలను రచించారు. ఆయా రాగాల విన్యాసానికి వాటిని మార్గదర్శకులుగా తీసుకొనడం జరిగింది. త్యాగరాజు, దీక్షితార్ల కాలం నాటి పరిస్థితి ఇది. శ్రీ త్యాగరాజస్వామి గురువైన శొంఠి వెంకట రమణయ్య, వెంకటమఖి శిష్య పరంపరకు చెందిన వాడు. వెంకటమఖి భావించిన మేళ పద్ధతిలోనే కాక ఆ మేళాలకు సంబంధించిన లక్షణ గీతాలలో కూడా ముత్తుస్వామి దీక్షతో శిక్షణ పొందారు. ఈవిధంగా వెంకటమఖి మేళాలను జనరంజకం చేసే కర్తవ్యం ఈ ఇద్దరి వాగ్గేయకారులకు సంక్రమించింది. వారు దానిని చాలా విజయవంతంగా నిర్వహించారు.

తంజావూరు సోదరులు భరత నాట్య రంగంలో గొప్ప సాఫల్యత

సాధించిన కుటుంబానికి చెందిన వారు. శిష్ట సాంప్రదాయ సంగీతంలో కూడా ప్రావీణ్యత సంపాదించాలని వారి కోరిక. దీనికొరకు వెంకటమఖి 72 మేళాల పధకాన్ని అభ్యసించాలని వాంఛించారు. ఈ లక్ష్య సాధనకే వారు దీక్షితార్‌ను తంజావూరు వచ్చి తమను శిష్యులుగా స్వీకరించమని ప్రార్థించారు. తాను తంజావూరు లో స్థిరపడిన తరువాత దీక్షితార్ ఈ కార్యానికి పూనుకొని పొన్నయ్య, అతడి సోదరులకు వెంకట మఖి విరచిత 72 మేళాలను వాటికి సంబంధించి లక్షణ గీతాలను నేర్పడం ప్రారంభించారు. వీటిని వారు సులభంగా గ్రహించేందుకనువుగా ఆయన "వివడి మేళాలన్నిటి"లోనూ కీర్తనలను రచించి వాటిని పొన్నయ్య సోదరులకు బోధించారు. ఈ రచనలలో అధికభాగం తంజావూరు దేవతామూర్తులపై ఉండడం సహజం. ఈవిధంగా దీక్షితార్ బృహదీశ్వరుని పైన, బృహన్నాయకి పైన రచించిన కృతులలో చాలాభాగం వెంకట మఖి రూపొందించిన వివడి మేళాలలో ఉండడం సంభవించింది.[1]

ఇవి గీతాల వలె ఉండే చిన్న చిన్న ఖండికలు. పొన్నయ్య, అతడి సోదరులకు ఈ మేళాలను బోధించడానికి ఉద్దేశితమైనవి. కాన దానికనుగుణముగా ఉన్నాయి. తంజావూరు సోదరులలో కనీసం ఇద్దరు కర్నాటక సంగీత ప్రపంచంలో మంచి గుర్తింపు సంపాదించగలిగారు. పొన్నయ్య తంజావూరు ఆస్థాన విద్వాంసుడవడమే కాక గుర్తించుకోదగిన అనేక కృతులను రచించారు. వీటిలో తన గురువైన "గురు-గుహ"కు నివాళులర్పిస్తూ రచించిన తొమ్మిది కీర్తనల సముదాయాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది. భిన్న షడ్జరాగం (వెంకటమఖి పధకంలో తొమ్మిదవ మేళా) లో రచించిన కీర్తనలో "నేను శ్రీగరు-గుహ శిష్యుడను" అని చెప్పుకుంటారు.[2] వెంకటమఖి పధకంలో 35వ మేళమైన శైలదేశాక్షి రాగంలో విరచితమైన కీర్తనలో ఆయన వివడి మేళాలపై తనకున్న అద్భుతమైన పట్టును ప్రదర్శించాడు. నాట్యకళలో ఆరితేరిన వడివేలు

---

[1]ఉదాహరణకు వివడి మేళాలలో 3,4,30,34,40,41,42,44,48,49 నెంబర్ల కీర్తనలున్నాయి. ఈ పట్టిక పరిపూర్ణమైనది కాదు.

[2]శ్రీగురు-గుహమూర్తికి నే శిష్యుడై ఉన్నానురా (పల్లవి).

తిరువాంకూర్ మహారాజా ఆస్థాన విద్వాంసుడయ్యాడు. ఆయన సాఫల్యతాల చరిత్ర జగద్విత౦.

త్యాగరాజు, దీక్షితార్‌లు ఎప్పుడైనా కలిశారా అనే ప్రశ్న తరుచు ఎదురవుతూ ఉంటుంది. దీనికి సంబంధించిన ప్రమాణబద్ధ అనుశ్రుతి లేదు. కాని వారు తంజావూరులో కలవడానికి ఎక్కువ అవకాశం ఉంది. తాను తంజావూరులో ఉన్నప్పుడు దీక్షితార్ ఆ ప్రాంతంలోని ప్రసిద్ధికెక్కిన ఆలయాలనన్నింటినీ దర్శించేవాడు. వాటిలో తిరువయ్యార్ ఒకటి. అచ్చటి దేవతామూర్తులపై "ప్రణథార్థిహర" "ధర్మ నంవర్ధని" అనే కృతులను రచించారు. క్షేత్రపాలునిపై కూడా రచనలు చేశాడు. (నాయకి రాగంలో నున్న "ప్రణథార్థి హరం" మధ్య మావతి రాగంలోనున్న "ధర్మ సంవర్ధని", నామదేశి రాగంలోనున్న "నర్మద", దేవ ప్రియరాగంలోని "శ్రీవటుకనాథ" వీటిలో కొన్ని కృతులు). దీనినిబట్టి ఆయన తిరువయ్యార్ దర్శించాడనేది ఖాయం. ఈ సందర్భంలో ఆయన త్యాగరాజుని కలవడం సంభవమే. వారిద్దరి సమావేశం గురించి తెలిపే ఒక చిన్న కథ ఉంది. తిరువయ్యార్ ఆలయ దేవతామూర్తులను దర్శించడానికి మొదట ఆ గ్రామానికి వెళ్ళినపుడు దీక్షితార్ ధర్మ నంవర్ధని దేవి ఆలయం ముందు కూర్చొని ఆదేవిపై పైన పేర్కొనబడిన తన కృతిని గానం చేశాడు. ఆ సమయంలో త్యాగరాజు శిష్యులలో ఒకడు అక్కడ ఉండడం తటస్థించింది. అతడీ విషయాన్ని తన గురువుకు నివేదించాడు. అది విన్న వెంటనే త్యాగరాజు దీక్షితార్‌ను సాదరంగా ఆహ్వానించి తన ఇంటికి తీసుకు వచ్చేందుకు ఆ శిష్యుని వెనుకకు పంపించాడు. దీక్షితార్ ఆ ఆహ్వానానికి ప్రతిస్పందించి త్యాగరాజు గృహానికి విచ్చేశాడు. ఆయన సందర్శన గొప్ప ఉత్సవ సమయంలో సంభవించింది. త్యాగరాజు ప్రతిరోజూ రామాయణ పారాయణం చేసేవాడు. ఆరోజు నాటికి "రామ పట్టాభిషేకం" ఘట్టానికి వచ్చారు. దీక్షితార్ తన శిష్య బృందంతో గృహప్రవేశం చేసే తరుణంలో భజన కొనసాగుతోంది. ఆయనను చూడగానే ప్రేక్షకులంతా ఆహ్వానించుటకు లేచి నిలుచున్నారు. త్యాగరాజు ఆయనకు స్వాగతం పలికితే దీక్షితార్ ఆయనకు తన అభివందనలు తెలిపాడు. అప్పుడు సందర్భోచితంగా త్యాగరాజు ఆయన శిష్యులు భైరవి రాగంలో "కొలువై

యున్నాడో" అనే కృతిని గానం చేశారు. ఆ తర్వాత త్యాగరాజు అభ్యర్థనపై ఆయన శిష్యులు మణిరంగు రాగంలో "మామవ పట్టాభిరామ" అనే కృతిని ఆలపించారు. ఇద్దరు మహోన్నత వాగ్గేయకారులు గానం చేసిన ఈ అపురూప సన్నివేశం శ్రోతలనందరినీ మంత్రముగ్ధులను చేసింది. తదుపరి జరిగిన సమారాధనాంతరం దీక్షితార్ అక్కడి నుండి నిష్క్రమించాడు.[1]

దీనిని నిర్ధారించే ప్రత్యేక ఆధారం లేకపోయినప్పటికీ ఈ ఉదంతంలో అసందర్భం ఏమీ లేదు. 1834లో ముత్తుస్వామి దీక్షితార్ మరణించిన తరువాత జరిగిన సంఘటన గురించి ఒక అనుశ్రుత గాథ ఉంది. దీనిననుసరించి సుబ్బరామ దీక్షితార్‌కు ఏడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు బంధువులాయనను తిరువయ్యార్ తీసుకు వెళ్లారు. ఆసందర్భంలో తనకు సాష్టాంగ నమస్కారం చేసిన ఈ బాలుని చూసి త్యాగరాజు కంట తడిపెడుతూ ముత్తుస్వామి దీక్షితార్ ఘనతను గూర్చి ప్రసంగించాడు. అతడికి కలకండనిచ్చి ఆశీర్వదించాడు.

ఈకాలంలో తంజావూరు రాజ్యాధిపతి సర్ఫోజి. ఈయన సంగీతాభిమాని, కళాపోషకుడు, శ్యామశాస్త్రి ఆయన మిత్రులలో ఒకరు. సర్ఫోజి స్వయంగా అగ్రహారంలోనున్న శ్యామశాస్త్రి ఇంటకి వచ్చి ఆయనకు తన గౌరవాభివందనాలను తెలియజేసేవాడని చెప్తారు. దీక్షితార్ భార్య తరచు శ్యామశాస్త్రి భార్యను సందర్శించేది. ఒక మారు శ్యామశాస్త్రి భార్య ఆమెతో "తంజావూరు రాజు మీ భర్త కీర్తనలను చాల ప్రశంసిస్తున్నాడనీ, అందుచేత ఆయన కనుక రాజదర్శనానికి వెడితే "కనకాభిషేక" సత్కారం పొందడం ఖాయమని నా భర్త తెలియజేశాడు" అని చెప్పింది. ఇది విన్న దీక్షితార్ భార్య ఎంతో ఉద్విగ్నురాలయింది. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత భర్తతో "రాజు మీ కీర్తనలను మెచ్చుకుంటున్నాడని మిమ్మల్ని సత్కరించదలుచుకొన్నారని అందరూ చెపుతున్నారు. మీరాయన వద్దకు ఎందుకు వెళ్ళరు? ఆయన మిమ్మల్ని శాలువాలతో, వస్త్రాలతో, బంగారు నగలతో, పాత్రలతో ధనంతో ముంచెత్తుతాడు. ఇంక జీవితమంతా మనం ధనవంతులుగా గడపవచ్చు" అని వ్యక్తం చేసింది. అయితే దీక్షితార్ "రాజును దర్శించడమంటే ఏమిటో నీకు

[1] క్రి.శే. సి.ఆర్. శ్రీనివాస అయ్యంగార్ ఈ ఉదంతం గురించి తెలియజేశారు.

తెలుసా? ఆయనపై కీర్తన వ్రాసి ఆ పని చేయువలసి ఉంటుంది. నన్నాయనను కీర్తించమంటావా?" అని అడిగాడు. "అందులో తప్పేముంది? మీ తండ్రి గారే ఆపని చేశారు", అని భార్య సమాధానమిచ్చింది. దీనికి దీక్షితార్ వెనువెంటనే, నేనాపని చేయను. నేను సంపద కావాలనుకుంటే భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. కాని మానవుణ్ణి ఆరాధించను. నశించిపోయే ధన సంపదలను మాత్రం ఇవ్వగలగడమే కాక ఎన్నడూ నాశనం కాకుండా జీవితానంతరం కూడా నిత్యమై ఉండే పరమానంద భాగ్యాన్ని కూడా ప్రసాదించే లక్ష్మీదేవిని ప్రార్థిస్తాను" అని జవాబిచ్చాడు. ఈ చర్చా ఫలితం దీక్షితార్ భార్యనంతగా సంతృప్తి పరచలేదు.

సాధారణంగా దీక్షితార్ భార్య అటువంటి వైఖరి ప్రదర్శించేది కాదు. కాని ఆనాడమె వైఖరి అసాధారణంగా ఉంది. దీనికెంతో చింతించిన దీక్షితార్ లలిత రాగంలో శ్రీసూక్త లక్షణబద్ధంగా "హిరణ్మయిం లక్ష్మీం" అనే కీర్తన ద్వారా లక్ష్మీదేవి ఆశీస్సులను ఆవాహనం చేశాడు. "నేనెల్లప్పుడూ లక్ష్మీదేవిని ప్రార్థిస్తాను. అల్పమానవుల దగ్గరికి వెళ్లడానికి నిరాకరిస్తాను. ఆమె నాకు నాశనంలేని సంపదను ప్రసాదిస్తుంది"[1] అని ఇందులో ఆయన వ్యక్తం చేశాడు. తదుపరి దగ్గరిలోనున్న శ్రీరాజగోపాలస్వామి ఆలయానికి వెళ్ళి అచ్చటి దేవి ఆలయ సన్నిధిలో ఈ కీర్తనను గానం చేశాడు. ఆ రాత్రి లక్ష్మి బంగారు నగలతో ప్రకాశిస్తూ ఆయనకు కలలో ప్రత్యక్షమై "నీకు పేదరికం లేదు" అని శలవిచ్చింది. దీక్షితార్ వెంటనే మేల్కొని ఆ కల గురించి తన భార్యకు వివరించాడు. అప్పటికే బాధాతప్తురాలై ఉన్న ఆమె "నేనన్నది మరచిపోయి నన్ను మన్నించండి" అని ప్రాధేయపడింది. దీక్షితారప్పుడు "ధన్యాణి రాగంలో మంగళ దేవతాయ" అనే కృతి రచించాడు. ఇందులో "ఓ! లక్ష్మి, పేదరికం వంటి దురవస్థల నాశనకారీ, గురు-గుహ భక్తుల ఎడ నువ్వు అనుగ్రహ ప్రదాయినివి. నువ్వు నన్నెంతగానో మన్నించావు." దీక్షితార్ కుటుంబంలో అనుశ్రుతంగా వస్తున్న ఈ ఉదంతాన్ని పైన ఉదహరితమైన

---

[1]హిరణ్మ యాం లక్ష్మీం సదాభజామి
హీన మానవాశ్రమం త్యజామి!
స్థిరతర సంపత్ ప్రదాం!

రెండు ఖండికలు బలపరుస్తున్నాయి. దీక్షితార్ కులికర్రైలో రచించిన రాగమాలికకు సంబంధించిన ఉదంతానికి ఇది అనుగుణంగానే ఉంది. దీనిని గురించి ఇది వరకే పేర్కొనడం జరిగింది.[1]

[1]మంగళ దేవత యాత్యయా బనిలోహం!

హరిద్రా కుంకుమ వస్త్రాలంకృతం విగ్రహయా,

దారిద్రయ దుఃఖాది మూర్తన్యాశివనిగ్రహయా,

వరలక్ష్మి యాహరిహాదు గురుగుహ భక్తానుగ్రహయా!

(ఇక్కడ "గురు-గుహభక్త" అనే మూల పాఠ్యాంతరానికి "నీ భక్తుడు -గురు-గుహ" అనే అర్థం కూడా ఉంది.)

## అధ్యాయం 6

# మధురై, ఎట్టయ్యపురం

నాలుగైదు సంవత్సరాలు తంజావూర్ లో గడిపిన తర్వాత ముత్తుస్వామి దీక్షితార్ తిరువారూర్‌కి తిరిగి వచ్చాడు. ఆయన రాక అనతికాలంలోనే సంగీత కళాకారుల, పండితుల దృష్టిని ఆకర్షించడంతో ఆయన గృహం తిరిగి సంగీత కచేరీలు, వేదమంత్రపఠనలతో ప్రకంపించడం ప్రారంభమైంది. అయితే ఇంట్లో ఇంత సందడి ఉన్నా దీక్షితార్ మనస్సు మాత్రం సంతోషపూరితంగా లేదు. అది ఆయన సోదరుల సంక్షేమం గురించి రేగిన ఆలోచనలతో సతమతమవుతోంది. ఆయన వారిని చూసి చాలా కాలమైంది. ఇటీవల వారితో సంబంధాలు కూడా తెగిపోయాయి.. వారి యోగక్షేమాలు తెలుసుకోనవలెననీ ఆతృతతో విస్తృతంగా వాకబు చేశాడు. కొద్దికాలం గడిచిన తరువాత చిన్నస్వామి దీక్షితార్ మరణం గురించి సూచన ప్రాయంగా తెలిసింది. దీనితో వెంటనే మధురై వెళ్ళి తన తమ్ముడైన బాలుస్వామిని చూడాలనే నిర్ణయం తీసుకున్న దీక్షితార్ సుబ్రహ్మణ్య అయ్యర్ అనే శిష్యుని తోడు తీసుకొని అక్కడకు ప్రయాణమయ్యాడు.

దీక్షితార్ ఊహాలోకంపై మధురైకి గట్టి పట్టు ఉంది. అది ఈ దేశంలోని అతి ప్రాచీన నగరాలలో ఒకటి. హాలశ్య క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. సుందరేశ్వర, మీనాక్షినామధారులైన శివపార్వతుల కంకితమైన ఆలయం నెలకొని ఉన్న స్థలం. తమ వీరత్వానికీ, విజయాలకూ అఖిల భారత గుర్తింపు సాధించిన పాండ్యరాజులకది రాజధాని.[1] ప్రాచీన సంస్కృతికిది నిలయం. పాండ్యుల అధిష్ఠాన మహర్షి అయిన అగస్త్యుడు పునీతం చేసిన పవిత్ర స్థలం. అక్కడకు వెళ్లాలని దీక్షితార్ చాలాకాలం

---

[1]కాళిదాసు రఘువంశములోని 4,6, ఆశ్వాసాలను చూడండి.

నుండి ఆలోచిస్తున్నాడు. తన సోదరులను అక్కడకు పంపాడంటే వాస్తవానికి మున్ముందు రక్షకదళం తరలి వెళ్లడం లాంటిదే. ప్రస్తుతం ఆయన అక్కడకు వెళ్లడం వ్యాకుల పూరిత పరిస్థితులలోనే జరిగింది. అయినప్పటికీ అక్కడి ఆలయాలను దర్శించి వాటిలో అలరారుతున్న దేవతామూర్తులను కీర్తిస్తూ గానం చేయాలనే ఆరాటం మాత్రం ఆయనలో చల్లారలేదు.

మధురై చేరుకొనగానే ఆయన వేగవతి (జనశ్రుతిలో వైగై గా పేరొందింది) నదీ తీరాన ఉన్న వినాయక మందిరాన్ని చూసి బిల్హారి రాగంలో "ఏకదంతభజేహం" అనే కీర్తనను గానం చేశాడు. ఇందులో ఆయన వినాయకుని "హాలాశ్యక్షేత్రంలో వేగవతీ నదీ తీరాన విరాజిల్లుతున్న దేవుని" అభివర్ణిస్తాడు.[1] తదుపరి శ్రీ మీనాక్షి ఆలయానికి వెళ్లి ఆమెను ఆరాధించిన తర్వాత ఆలయ సన్నిధిని కూర్చొని ఆ దేవిని కీర్తిస్తూ అనేక కీర్తనలను గానం చేశాడు. చివరకు వరాళిరాగంలో "మామవ మీనాక్షి" అనే కీర్తనలో ఈ గానాలాపనను ముగించాడు: ఈ సమయానికి ఆలయ అర్చకులు అక్కడకు చేరారు. అనేకమంది ఆరాధకులాయన చుట్టూ గుమిగూడారు. అప్పుడు అర్చకులలో ఒకరు, "అయ్యా తిరువారూర్ నుండి వచ్చిన ఇద్దరు గాయకులు వీటిలో కొన్ని కీర్తనలను పాడగా విన్నాము. ఇవి దీక్షితార్ కీర్తనలు. మీరు కూడా తిరువారూర్ నుండి వచ్చారా?" అని అడిగాడు. దానికి, "ఈయన నాగురువు గారు, ఈ కీర్తనలను రచించిన ఆ దీక్షితార్ ఈయనయే" అని దీక్షితార్ సమాధానమిచ్చాడు. ఇది వినగానే అక్కడ చేరిన అర్చకులు, ఆరాధకులు దీక్షితార్ ముందు సాష్టాంగపడ్డారు. వారు పేర్కొనిన గాయకుల గురించి అడిగినప్పుడు చిన్నస్వామి గతించినారని అందుకు దుఃఖ పీడితుడైన బాలూస్వామి రామేశ్వరం వెళ్లాడని, యాత్ర ముగించుకొన్న తర్వాత తిరిగి వస్తానని మాట ఇచ్చినాడని తెలియజేశారు. వారంతా దీక్షితార్‌ను మధురైలోనే ఉండి పొమ్మని పట్టుబట్టారు. తన తమ్ముడి రాకకు ఎదురు చూస్తూ ఆయన ఆవిధంగానే చేశాడు.

మధురైలో నివసించినంత కాలం దీక్షితార్ అచ్చటి ఆలయాలను అనుదినం దర్శించి వాటిలోని దేవతామూర్తులను కీర్తిస్తూ అనేక కృతులను

---

[1] హాలారూప ప్రకృతి వేగవతీ తట విహారం!

గానం చేశారు. శ్రీ మీనాక్షిపై ఎనిమిది విభక్తులలో ఎనిమిది కీర్తనల సముదాయాన్ని రచించాడు. దేవకీయు రాగంలోనున్న "మధురాంబ సంరక్షతు"; అఠాణా రాగంలోని "శ్రీ మధురాంబికాయ", బేగడ రాగంలోని "శ్రీ మధురాంబికాయస్థవ" అరుదైన స్థవరాజ రాగంలో నున్న "మధురాంబం భజరే" అనే కృతులు వీటిలో ముఖ్యమైనవి. ఈ కీర్తనల సముదాయాన్నే కాక శ్రీ మీనాక్షి మీద అనేక ఇతర కీర్తనలను కూడా రచించారు. గమక క్రియరాగం లోనున్న "మీనాక్షి మేముదందేహి", వరాళి రాగంలోనున్న మామవ మీనాక్షీ మోహన రాగంలోని "కాదంబరి ప్రియమ్మై", గౌరి రాగంలోని శ్రీ మీనాక్షి గౌరి అనే కీర్తనలు వీటిలో అత్యంత ప్రసిద్ధి చెందినవి.

సుందరేశ్వరునిపై కూడా చాలా కీర్తనలున్నాయి. శుద్ధ వసంతరాగంలోని "సోమసుందరేశ్వరం", కన్నడ రాగంలోని "పాలయమాం పర్వతీశ" అనే కీర్తనలు ప్రత్యేకంగా చెప్పుకోతగ్గవి. శుద్ధ వసంతరాగం చాలా అరుదైనది. అందులోనున్న కీర్తన ఇదొక్కటే. అది కన్నడ రాగానికి సన్నిహితంగా ఉంటుంది. వాటి విశిష్ట లక్షణాలను వెలువరించడానికి ప్రగాఢ పరిజ్ఞానం, పరిపూర్ణ నైపుణ్యం అవసరమవుతాయి. సుందరేశ్వరుని పై విరచితమైన కీర్తనల సముదాయానికే చెందిన ఈ రెండు రాగాలలోని కృతుల రచన వాటి విశిష్ట లక్షణాలను ప్రస్ఫుటం చేయడానికే ఉద్దేశితమైనవి. మరొక అపూర్వ రాగమైన "సావీర" గురించి కూడా చెప్పవలసి ఉంది. మధురైకి సమీపంలోనున్న పుష్పవనేశ్వరునిపై దీక్షితార్ ఈ రాగంలో "సరససావీర" అనే కృతిని రచించాడు. జనరంజకమైన రాగాలలో కూడా కృతులున్నాయి. శంకరాభరణ రాగంలోనున్న "సుందరేశ్వరాయ", దర్బార్ రాగంలోని "హలాశ్వనాథం" ఈ కోవకు చెందినవి.

మధురైలో కొన్ని నెలలు గడిపిన తరువాత తన సోదరుని చహరా తెలుసుకునేందుకు వీలవుతుందనే ఉద్దేశ్యంతో దీక్షితార్ రామేశ్వర యాత్రకు వెళ్లడానికి నిర్ణయించుకొంటాడు. ఈ ప్రయాణంలో ముందుగా అలగర్‌కోయిల్ చేరతాడు. ఇక్కడ "సుందరరాజ" నామాంకితుడైన విష్ణుమూర్తి ఆలయం ఉంది. ఈ దేవతామూర్తిని కీర్తిస్తూ దీక్షితార్ రచించిన "శ్రీ సుందరరాజం" అనే కృతి ఆయన అద్భుత రచనలలో ఒకటి. అది

"రామక్రియ ( ప్రస్తుతం కామవర్ధిని రాగంలో ఉంది. ఇందులో ఈ రాగ చిత్రణ అత్యంత సంతృప్తిని కలిగించేటంతటి పరిపూర్ణత సంతరించుకొంది. ఆలయం అధిష్టించిన కొండలపై "నుపుర గంగ" అనే పేరుతో నున్న జలపాతాల గురించి అక్కడ "తపస్సు" చేసి దైవానుగ్రహానికి పాత్రుడైన మాండూక మహర్షి గురించి అది ప్రస్తావిస్తుంది. తమకు సంబధించిన ఇతిహాస గాధలు ప్రాచుర్యం పొందని కొన్ని ప్రముఖ ఆలయాలు దక్షిణ భారత దేశంలో కొద్దిగా ఉన్నాయి. ఈ గాధలకు ప్రాణ ప్రతిష్ట చేయడం దీక్షితార్ కృతుల ఆసక్తిదాయ లక్షణాలలో ఒకటి. దీనితో ఇవి జనరంజకమయాయి. తీర్ధ యాత్రలకివి బైబిల్ వంటివని పరిశోధనా పండితులకు సమచారాన్ని సమకూర్చే విలువైన గనులని చెప్పవచ్చు.

దీక్షితార్ ఆ తర్వాత రామేశ్వరం వెళ్ళాడు. అక్కడ ఆయన అనేక కృతులను రచించాడు. వీటిలో రామక్రియ రాగంలో నున్న "రామనాధం బజేహం" అనే కృతి చాలా ప్రాచుర్యం పొందింది. దర్భశయనం వద్ద ఆయన ప్రసిద్ధి చెందిన " శ్రీ రామ రవి కులాబ్ది సోమం" అనే కీర్తనను గానం చేశాడు. ఇది "నారాయణ గౌళ" అనే అపూర్వ రాగంలో విరచితమైనది. ఆ రాగ బాణీలో నిస్సందేహంగా సర్వోత్కృష్టమైన కృతి. ఒక సంగీత విద్వాంసుడు తిరువారూర్ నుండి అక్కడకు వచ్చాడని, ఆ తర్వాత అక్కడకు యాత్రకు వచ్చిన ఎట్టయ్యపురం మహారాజు అతడిని తన ఆస్థాన విద్వాంసునిగా నియమించి తనతో తీసుకు వెళ్లినాడని దీక్షితార్ కు రామేశ్వరంలో తెలిసింది. ఆ విద్వాంసుడు తన తమ్ముడేనని నిర్ణయించుకొన్న దీక్షితార్ ఎట్టయ్యపురం ప్రయాణమయ్యాడు.

దారిలో ఆయన సత్తూర్ అనే స్థలంలో మకాం చేశారు. అక్కడున్న వెంకటేశ్వరస్వామి ఆలయంలో పూజ చేస్తున్న సందర్భంలో వైష్ణవ అర్చకులు పఠిస్తున్న కృష్ణస్వామిపై తమిళంలో విరచితమైన ప్రబంధాలను ఆలకించారు. ఈ సంఘటన ఆయనపై ప్రగాఢమైన ప్రభావాన్ని నెరిపింది. ఆ తర్వాత ఆయన ఆలయానికి ఆనుకొని ఉన్న సత్రానికి వెళ్లి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో అక్కడ చేరిన అర్చకులు ఒక ఉన్నత కుటుంబంలో జరిగే వివాహానికి హాజరవడానికి చేసుకోవలసిన ఏర్పాట్ల గురించి బిగ్గరగా చర్చించుకొనడం చూశారు. అప్పుడాయన "దేనిని గురించి ఈ "చర్చ?" అని అడిగాడు. దానికా అర్చకులు "అయ్యా! ఎట్టయ్యపురం

మహారాజా తన ఆస్థాన సంగీత విద్వాంసునికి ఎల్లుండి వివాహం జరిపిస్తున్నాడనే విషయం మీకు తెలియదా? మేం దానికి వెడుతున్నాము. మాకు రాజోచిత దక్షిణ లభిస్తుంది" అని జవాబిచ్చారు. అప్పుడు దీక్షితార్, "ఆ సంగీత విద్వాంసుని పేరేమిటి?" అని అడిగాడు. దానికి వారు, "ఆయన తిరువారూర్ నుండి వచ్చిన ఎవరో దీక్షితార్. అంతవరకు మాత్రమే మాకు తెలుసు" అని సమాధాన మిచ్చారు. "అతడి పేరు బాలూస్వామి దీక్షితారా?" అని దీక్షితార్ ప్రశ్నించాడు. "అవును. ఆ విషయం మీకెలా తెలుసు?" అని అర్చకులలో ఒకరు జవాబిచ్చారు "నేనతని అగ్రజుణ్ణి. నేనూ అక్కడికి వెళ్లాలనుకుంటున్నాను" అన్నాడు దీక్షితార్. "అయ్యా! మిమ్మల్ని మాతో తీసుకువెడతాం. సిద్ధంగా ఉండండి" అన్నారు అర్చకులు. పరిస్థితి ఈవిధంగా మళ్లినందుకు దీక్షితార్ అమితానందభరితుడయ్యాడు. వెంకటేశ్వరస్వామి అనుగ్రహం వల్లనే ఈవిధంగా జరిగిందని తలంచి ఆయనను కీర్తిన్తూ మేఘరంజని రాగంలో "వెంకటేశ్వర యాదవ భూపతిం ఆశ్రయేహం" అనే కీర్తనను గానం చేశారు. ఆ తరువాత అర్చకులతో కలిసి ఎట్టయ్యపురం ప్రయాణమయ్యాడు.

అది మండు వేసవి. భరించలేని ఎంత వేడిమి. ఎట్టయ్యపురానికి వెళ్లే రహదారి ఆర్చుకుపోయిన పాడి ప్రాంతాల గుండా సాగుతుంది. దానిమీద ప్రయాణం చేయడం దీక్షితార్ కంత సుఖప్రదంగా లేదు. ఆయన దాహపీడితుడై ఒక ఊరి బయటనున్న చెట్ల తోపు వద్ద ఆగమని తనకు తోడు వచ్చిన వారిని కోరినారు. అచ్చట బండి దిగి చెట్ల నీడలో కూర్చున్నాడు. ఆ తోట ఒక స్థానిక ప్రముఖ వ్యక్తికి చెందింది. సాధుపుంగవుడైన దీక్షితార్ రాకతో తను ధన్యుణ్ణి అయ్యానని భావించిన ఆయన దీక్షితార్‌కు అభివాదం చేసి మంచినీళ్ళు తెప్పించడానికి ఏర్పాటు చేశాడు. ఎందుకింత నీటి ఎద్దడి ఏర్పడిందని దీక్షితార్ అడిగిన ప్రశ్నకు వరుసగా కొన్ని సంవత్సరాల నుండి అనావృష్టి పరిస్థితులు ఏర్పడ్డాయని నీటి వనరులు చాలా వరకు ఎండిపోయాయని, ప్రజలు లెక్కలేనన్ని ఇబ్బందులను చవి చూస్తున్నారని వివరించారు. దీక్షితార్ ఎంతో బాధపడ్డాడు. వెంటనే ఆ ప్రదేశంలోనున్న ఆలయానికి వెళ్లి దేవిని ప్రసన్నం చేసేందుకు ప్రత్యేక పూజ

చేశాడు. ఆ తర్వాత "ఆనందామృతవర్షిణి" అనే సుప్రసిద్ధ కృతిని గానం చేశాడు. "ఓ దేవీ! నీవు మహా కరుణామయివి. దండిగా వర్షాలను కురిపించమని నిన్ను ప్రార్థిస్తున్నాను. వెంటనే వాటిని ప్రసాదించు . వర్షాల నివ్వు" అని ఈ కృతిలో ఆయన దేవిని వేడుకుంటాడు.[1] ఆయన ఈ కృతిలో పాట ముగించే సరికి ఒక మహిమాన్విత సంఘటన జరిగింది. అంతవరకు స్వచ్ఛంగానున్న నీలి ఆకాశంలో అకస్మాత్తుగా మబ్బులు కమ్ముకున్నాయి. చాలా అరుదుగా కనిపించే రీతిలో కుంభవృష్టిగా వర్షం కురిసింది.[2] ఈ కీర్తన అమృతవర్షిణి రాగంలో ఉంది. ఇది నూతన స్వర మేళం. దీనిని దీక్షితార్ కల్పించినట్లుంది. ఈ రాగంలో ఇంతక్రితం రచనలున్నట్లు తెలియడం లేదు. దాని లక్షణం కూడా ఇంకెక్కడా కాన రావడం లేదు. అటు తర్వాత ఈ రాగం చాలా జనరంజకమైంది. ముత్తయ భాగవతార్ రచించిన "సుధామయి" అనే సుప్రసిద్ధ కీర్తనే కాక ఇటీవల అనేక గీతాలు ఈ స్వర కల్పనలో రూపొందాయి. హంసధ్వని రాగం రామస్వామి దీక్షితార్ సృష్టి అయినట్లే, అమృత వర్షిణి రాగం ముత్తుస్వామి దీక్షితార్ కల్పన అని నిబ్బరంగా చెప్పవచ్చు.

వర్షం వెలిసిన తరువాత దీక్షితార్ తన ప్రయాణం కొనసాగించాడు. మునుముందుగా ఎట్టయ్యపురం చేరిన కొంతమంది అర్చకుల ద్వారా ముత్తుస్వామి దీక్షితార్ అక్కడికి వస్తున్నాడనే సమాచారం బాలూస్వామి దీక్షితార్‌కి, ఎట్టయ్యపురం మహారాజుకు అందింది. వారెంతో ఆనందభరితులయ్యారు.

---

[1]ఆనందామృత వర్షిణి-అమృత వర్షిణి
హరాది పూజితే శివే భవాని! ...
సానంద హృదయ నిలయే సదయే,
స ద్యః స వృష్టి హే తవే త్వాం !
సంతతం చింతయే అమృతేశ్వరీ
సలిలం వర్షయ వర్షయ!

[2]స్థానిక కుటుంబ సాంప్రదాయ గాధలు ఈ ఉదంతాన్ని బలపరుస్తున్నాయి. (చూడండి . "సంగీత సాంప్రదాయ ప్రదర్శిని", తెలుగు ప్రతి 1904 ఎట్టయ్యపురం, రెండవ సంపుటి పేజీ 1229.)

పట్టణ ముఖద్వారం వద్ద దీక్షితార్‌ను కలుసుకునేందుకు బాలుస్వామితో కలిసి మహారాజు విస్తృతమైన ఏర్పాట్లు చేశాడు. దీక్షితార్ అక్కడకు చేరగానే మహారాజు ఆయనకు ఘనస్వాగతం పలికి సత్కరించాడు. ఆ తర్వాత దీక్షితార్ సోదరులు తమ నివాసానికి తరలిపోయారు. ఇంటిలో వారిద్దరూ ఒకరినొకరు కలవగానే చలించిపోయారు. చాలాకాలం తరువాత కలుసుకొన్నందుకు ఒక ప్రక్క సంతోషం, చిన్నస్వామి మరణించాడనే బాధ మరొక ప్రక్క వారిని ముప్పిరిగొన్నాయి. బాలుస్వామి వివాహ విషయంలో ముత్తుస్వామి దీక్షితార్‌లో ఉల్లాసం భరితమయింది. బాలుస్వామిపై ఆశీస్సులు కురిపించారు. మహారాజు సుబ్రహ్మణ్య స్వామికి అకుంఠిత భక్తుడని, ఉదాత్త ప్రభువని, సంస్కృతం, తెలుగు, తమిళ భాషలలో దిట్ట అని, ఉదారకళా పోషకుడని, సంగీతం ఎడల ప్రత్యేకాభిమానాలు కలవాడని, తాను స్వయంగా ప్రతిభాపూర్వక శిష్ట సాంప్రదాయ కీర్తనలను రచించిన వాడని బాలుస్వామి అన్నగారికి విశదం చేశాడు. "నీ రచనల ఎడల ఆయనకు గొప్ప ప్రశంసాపూరక అభిమానం ఉంది," అని కూడా చెప్పారు.

వివాహోత్సవాలు ముగిసిన తరువాత మహారాజు ముత్తుస్వామి దీక్షితార్ ఎట్టయ్యపురంలోనే స్థిరపడి తనకు గురుభిక్ష పెట్టమని ప్రార్థించాడు. తిరుచిరాపల్లిలో నివసిస్తున్న తన కుమార్తెను మినహాయిస్తే దీక్షితార్ అప్యాయత చూరగొనిన వ్యక్తి ఎట్టయ్యపురంలో స్థిరపడిన బాలుస్వామి ఒక్కడే. అందుచేత దీక్షితార్ అతడితోనే నివసించడానికి నిశ్చయించుకొన్నాడు. దీనికి తోడు ఆయనలో ఆ ప్రాంతంలో ఉన్న క్షేత్రాలను దర్శించాలనే ఆరాటం కూడా బలీయంగానే ఉంది. అందుచేత ఆయన తాను ఎట్టయ్యపురంలో సంతోషపూర్వకంగా స్థిరపడతానని కాని ఆపని చేసేముందు తిరువారూర్ వెళ్ళి అచ్చటి నివాసాన్ని ఖాళీ చేయవలసి ఉందని మహారాజుతో చెప్పాడు. దీనికానందించిన మహారాజు ఆయన తిరువారూర్ వెళ్ళిరావడానిక వసరమైన అన్ని ఏర్పాట్లు చేశాడు. దీక్షితార్ తిరువారూర్ వెళ్లి అక్కడ కొద్ది రోజులుండిన తరువాత తన బంధువులు, మిత్రుల వద్ద శలవు తీసుకొని ఎట్టయ్యపురం తిరిగి వచ్చాడు. అటు పిమ్మట తన శేష జీవితాన్ని ఎట్టయ్యపురంలోనే వెళ్ళబుచ్చాడు.

ఈ దశలో ఆయన దక్షిణ ప్రాంతంలోని అనేక ప్రసిద్ధి దేవాలయాలను దర్శించి వాటిపై కృతులను రచించాడు. వాటిలో కొన్నిటిని ఇచ్చట ఉదహరించడం జరుగుతుంది. ఎట్టయ్యపురానికి నలభై మైళ్ళ దక్షిణంగా సముద్రపు ఒడ్డున తిరుచెందూర్ అనే స్థలం ఉంది. సుబ్రహ్మణ్య స్వామి ఆరాధనకు సంబంధించిన ఆరు ముఖ్య క్షేత్రాలలో ఇది ఒకటి.శంకరాచార్యుడు దీనిని దర్శించి అచ్చటి దేవతామూర్తిని కీర్తిస్తూ "మయూరాధి రుథం" అనే సుప్రసిద్ధ పద్యాన్ని గానం చేశాడు. ఈక్షేత్రంపై ముత్తుస్వామి దీక్షితార్ రచించిన వాటిలో తోడిరాగంలో నున్న, "శ్రీసుబ్రహ్మణ్య మామ రక్షతు" అనే కృతి అన్నిటి కంటె ఎక్కువ ప్రాచుర్యం పొందింది. తిరుచందూర్‌లో ప్రసాదాన్ని ఎండుటాకులలో చుట్టి భక్తులను పంచడం జరుగుతుంది. ఈ గీతంలో ఈ ఆచారం గురించి ఉటంకించడం జరిగింది.[1] ఎట్టయ్యపురానికి పశ్చిమ దిశను ఇరువై ఐదుమైళ్ళ దూరంలో కనకశైలం (కఝుగుమలై) అనే స్థలంలో మరొక సుప్రసిద్ధ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం ఉంది. దీక్షితార్ దీనిని దర్శించి అచ్చటి దేవతా మూర్తిని కీర్తిస్తూ శుద్ధ ధన్యాశి రాగంలో "సుబ్రహ్మణ్యేశ్వర రక్షితోహం" అనే కృతిని గానం చేశాడు.

తిరునల్వేలిలో తామ్రపర్ణి నది ఒడ్డున ప్రసిద్ధి చెందిన ప్రాచీన శివాలయం ఒకటి ఉంది. ఇందులోని దేవతామూర్తి పేరు "శాలివటేశ్వరుడు" దేవేరి పేరు "కాంతిమతి". సింహరావ రాగంలోనున్న "శ్రీకాంతిమతిం", దేవగాంధారి రాగంలో నున్న "శాలివటేశ్వరం" అనేవి దీక్షితార్ ఇచ్చటి దేవతలపై రచించిన కృతులలో చెప్పుకోతగ్గవి. శుద్ధ తామ్ర వర్ణి గట్టులపై నిలచి ఉన్న అని దేవీ మందిరాన్ని గురించి ఆయన చేసిన వర్ణన గమనించతగ్గది.[2] స్ఫటికంలా స్వచ్ఛంగా ఉండడం తామ్రపర్ణి నదిలాల విశిష్ట లక్షణాలలో ఒకటి. "శుద్ధతామ్ర పర్ణి" అని వ్యక్తం చేయడంలో దీక్షితార్ ఈ అంశం గురించే ప్రస్తావించాడు. కల్లిడై కురిటిలో శ్రీలక్ష్మి వరాహ ఆలయంపై రచించిన "శ్రీలక్ష్మివరాహం" అనే కృతిలో అది "శారీరక రుగ్మతలను కొనిపోయే తామ్ర పర్ణినదీ గట్లపై ఉన్నట్లు" గా ఆయన వర్ణిస్తాడు. తామ్ర పర్ణిలో ప్రవహించేవి

[1] "పత్ర విభూతి ప్రధాన నిపుణ"

[2] "శుద్ధ తామ్ర పర్ణితట స్థితం!"

ఖనిజ జలాలని చెప్తుతారు.[1]వాటి ఔషదీయ లక్షణాల గురించి ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. మూలపాఠం లోని "భంగ" అనే మాట పక్షపాతం వంటి వ్యాధులను వర్ణించడాని కుపయోగపడిన ఔషధ శాస్త్ర పదం. కుటుంబ సాంప్రదాయ గాథలు దీక్షితార్‌కు వైద్యశాస్త్రం కూడా తెలుసునని తెలియజేస్తున్నాయి. ఈ కృతిలో ఆయన "భంగ" అనే మాటనుపయోగించడం దీనిని ధృవ పరుస్తోంది.

పశ్చిమ కనుమల ప్రాంతంలో ప్రజావ్యవహారంలో "సారిమలై"గా ప్రచారం పొందిన "శబరిమలై" అనే కొండ ఉంది. దీనిపై షస్త, అయ్యప్ప అనే పేర్లతో ప్రజా ప్రాచుర్యం పొందిన హరిహర పుత్రస్వామికి అంకితమైన ఆలయం ఉంది. దీనికి సంబంధించిన కథ ననుసరించి ఈ దేవతామూర్తి శివ విష్ణువుల కలయిక వలన జన్మించారు. కలియుగంలో అత్యంత శక్తివంతుడైన దైవమని ప్రజల విశ్వాసం. దీక్షితార్ ఈ ఆలయాన్ని దర్శించి దానిని కీర్తిస్తూ వసంతరాగంలో "హరిహర పుత్రం" అనే కృతిని గానం చేశాడు. ఇందులో ఆయన అందలి దేవతామూర్తిని "పాండ్య, కేరళ దేశాలపై వైభవాన్ని వెదజల్లుతున్న దైవంగా అభివర్ణించాడు."[2] దక్షిణ ప్రాంత ప్రజలలోనే షస్త ఆరాధన విస్తృతంగా వ్యాపించింది. ఈ వాస్తవికాంశాల గురించే ఇందులో ప్రస్తుతించడం జరిగింది. సంగీత లక్షణాలననుసరించి ఈఖండిక దీక్షితార్ రచనలలో అత్యుత్తమ శ్రేణికి చెందినది. వసంత రాగంలో విరచితమైన సర్వోత్కృష్ట కీర్తనలలో ఒకటి. "శ్రీకృష్ణం భజే మానస" అనే కీర్తన "గురు-పవన-పురస్వామి" గా అభివర్ణితుడైన కృష్ణ ప్రభుపై తోడి రాగంలో విరచితమైంది. "గురు-పవన-పుర" అంటే గురువాయూర్. దీనిని బట్టి దీక్షితార్ ఆ స్థలాన్ని దర్శించారని భావించవచ్చు. దక్షిణాది ఆలయాలను కీర్తిస్తూ వ్రాసిన కృతులు ఇంకా ఉన్నాయి. ఇక్కడ వాటి సంపూర్ణ పట్టికను సమర్పించవలసిన అవసరం లేదు. తీర్థయాత్రికునిగా దీక్షితార్ దక్షిణాదిన ఉన్న తిరుచెందూర్, సారిమలైల నుండి ఉత్తరాదిన ఉన్న ఖాట్మండు, బదరీనాథ్‌ల వరకు పర్యటించారని, ఈ యాత్ర వాగ్గేయకారు యోగీశ్వరులలో ఆయనకొక విశిష్ట స్థానం కల్పించినదని చెపితే చాలు.

---

[1]"భంగహర తామ్ర పర్ణోతీరస్థం!"

[2]పాండ్య, కేరళాది దేశాప్రభాకరం!

ముత్తుస్వామి దీక్షితార్ చివరి ప్రయాణ గాథ గురించి ఇక చెప్పవలసి ఉంది. 1834 "అర్పిసి" (ఆశ్వయుజ) మాసంలో దీపావళికి ముందు రోజైన చతుర్ధశి నాడు ఇది జరిగింది. ఆ రోజున మామూలుగానే ఆయన తెల్లవారు ఝామున లేచి యోగాసనాలను వేసిన తరువాత స్నానం చేయటం ప్రారంభించాడు. ఆ తరుణంలో ఆయనకు కాశీ అన్నపూర్ణేశ్వరి ప్రత్యక్షమై దేవి ఆయన తన దృష్టినటు నిమగ్నం చేసిన మరుక్షణంలో మాయమైంది. వెంటనే ఆయనకు "ఆమె నీకు ఈ జీవితంలో ఆహారం ఇవ్వడమే కాదు తదనంతరం మోక్షాన్ని కూడా ప్రసాదిస్తుంది" అని కాశీ అన్నపూర్ణేశ్వరి ఆలయ సన్నిధిలో చిదంబరనాథ యోగి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. తన జీవితం ముగియబోతోందని గ్రహించాడు. వెంటనే స్నానం ముగించి దేవికి నవరత్న పూజ చేసి పున్నాగవరళి రాగంలో "ఏహి అన్నపూర్ణే" కృతిని గానం చేశాడు.[1]

పూజానంతరం సందర్శకుల గదిలోకి వచ్చాడు. అక్కడ తనను చూడడానికి వేగిరం వచ్చిన ఒక విశిష్ట మహనీయుడు వేచి ఉన్నాడు. అతడే ఎట్టయ్యపురం మహారాజు. అటువంటి సమయంలో మహారాజు ఆయనను చూడడానికి రావడం అరుదైన విషయం. అందుచేతనే ఆ సంఘటన ఆయనలో ఉద్విగ్నత రేకెత్తించింది. అసలు జరిగిందేమిటంటే మహారాజు అధిరోహించే "గాంగేయ" అనే ఏనుగు ఆ రోజు తెల్లవారు ఝాము నుండి

---

పల్లవి

[1]ఏహి అన్నపూర్ణే సన్నిధేహి, సదా పూర్ణే సువర్ణే!

అను పల్లవి

(మాం) పాహి పంచా శత్పీఠ్రియం

దేహి రక్తవర్ణే అపర్ణే

చరణం: కాశీ క్షేత్ర నివాసినీ

కమలలోచన విశాలినీ

విశ్వేశ మనోల్లాసినీ-జగదీశ గురుగుహ పాలినీ-

విద్యాయ పావనీ పున్నాగవరాళి ప్రకాశిని

షట్ త్రింశత తత్వవికాశినీ సువాశినీ భక్తి విశ్వాసినీ

చిదానంద విలాసినీ।

స్వైర విహారం చేయడం ప్రారంభించి తాళ్లు తెంచుకొని స్మశాన వాటికకు పోయి నిలిచింది. దానిని అదుపులో పెట్టడానికి చేసిన యత్నాలు ఫలించలేదు. ఈ విషయం తెలియగానే మహారాజు దానిని తనకు రాబోయే ఆపదను సూచించే అపశకునంగా భావించి ఆందోళన చెందాడు. వెంటనే ముత్తుస్వామి దీక్షితార్ ఆశీస్సులు పొందడానికి ఆయన వద్దకు వచ్చాడు. జరిగినదంతా చెప్పి ఆయన ముందు సాష్టాంగపడి "మీరు నాగురువు. జరిగన దానికి మనస్సెంతో కలవరపడుతోంది. నాకెటువంటి చెరుగైనా జరుగుతుందేమో దయ ఉంచి చెప్పండి" అన్నాడు. దీక్షితార్ కొద్దిసేపు ధ్యాననిష్ఠలో నిమగ్నుడై ఆ తర్వాత "మహారాజా, ఈ సంఘటన నీకెటువంటి చెడు కలిగించదు. ధైర్యంగా ఉండండి" అని జవాబిచ్చాడు.

"నాకిపుడెంతో ఆనందంగా ఉంది. అయితే నా రాజ్యం మాటేమిటి? దానికేమైనా ఆపద సంభవిస్తుందా?" అని మహారాజు అడిగాడు. "మీ రాజ్యానికి కూడా ఎటువంటి ఆపద సంభవించదు" అన్నాడు దీక్షితార్.

"నాకిప్పుడెంతో ఆనందంగా ఉంది. ఇదంతా మీ ఆశీస్సుల చలువ గురూ!" అని చెప్పి మహారాజక్కడనుంచి నిష్క్రమించాడు.

కొద్ది సమయం గడిచిన తరువాత దీక్షితార్ శిష్యులు ఆ గదిలో చేరి ఆయన కీర్తనలను పఠించడం ప్రారంభించారు. "ఈ రోజు చతుర్థశి. పర్వదినం. దేవికి పవిత్రమైన దినం. అందుచేత దేవిపై కీర్తనలను గానం చేయండి" అని దీక్షితార్ వారిని ఆదేశించాడు. అప్పుడాయన శిష్యులు గమకా క్రియారాగంలో "మీనాక్షి మేముదం దేహి" అని కీర్తన పాడడం ప్రారంభించారు. అది పూర్తవగానే దీక్షితార్ "దేవి నాబంధనాలను తెంచి వేయడానికి సిద్ధమవుతున్నట్లు గా ఉంది.[1] ఈ కీర్తనను మరొక మారు పాడండి" అని ఆదేశించాడు. శిష్యులావిధంగానే చేశారు. వారు అనుపల్లవిలోని

---

[1]ఉపనిషత్ వాక్యాలను ఇది స్ఫురణకు తెస్తుంది.
భిద్యతే హృదయ గ్రంథిః
ఛిద్యంతే పాపరాశయః!
క్షయంతే చాస్మ కర్మాణి
తస్మిన్ దృష్టే పరాపరే!!

"మీనలోచని, పసమోచని" అను పదాలను గానం చేస్తూ ఉంటే దీక్షితార్ తన ఐహిక జీవితబంధానల నుండి విముక్తి పొందాడు. ఆ తర్వాత, "గాంగేయ" నామాంకితమైన ఏనుగు శాంతించింది. తనంత తానుగా స్మశాన వాటికను వదలి తన శాలకు చేరింది.

దీక్షితార్ మరణవార్త వినగానే ఎట్టయ్యపురమంతా దుఃఖ సముద్రంలో మునిగిపోయింది. మహారాజు దిగ్భ్రాంతి చెందాడు. దీక్షితార్‌ను చివరిసారిగా దర్శించేందుకు ఆయన ఇంటికి సత్వరం బయలుదేరి వెళ్లి "నేను ఉదయం చూసినపుడు మీరు దివ్య తేజస్సుతో వెలిగిపోతున్నారు. నేను నా సంక్షేమం గురించే ఆలోచించాను. దానిని గురించే మిమ్మల్ని అడిగాను. నాకు గానీ నారాజ్యానికి గానీ ఎటువంటి హానీ జరగదనీ మీరిచ్చిన భరోసా నాకు ఉపశమనం కలిగించింది. కాని మీరు లేని లోటు, నాకు రాజ్యం లేని లోటుకంటే ఎక్కువ. మీరు కార్తికేయుని అవతారం. ఈ స్కంధ షష్ఠి రోజునే మీ స్వస్థానానికి చేరుకున్నారు" అని విలపించాడు. ఆయన ఆదేశాలపై దాని కొరకు ప్రత్యేకంగా ఎంపిక చేసిన స్థలంలో దీక్షితార్ భౌతిక కాయాన్ని దహనం చేయడం జరిగింది. అక్కడే ఒక సమాధిని కూడా నిర్మించడం జరిగింది. ఇప్పుడది కళను, మతాన్ని అభిమానించే వారందరికీ యాత్రా స్థలమైంది.

# అధ్యాయం 7
# ఆయన సంగీతం

ముత్తుస్వామి దీక్షితార్ రచనలలోని సంగీతం గురించి సమాలోచించడానికి మనమిప్పుడు ఉద్యుక్తులమవచ్చు. వాటి సంఖ్య వందలలో ఉంటుంది. అధిక భాగం కృతులు. అవిగాక కనీసం ఐదు రాగమాలికలు. ఒక పద వర్ణం. ఇది వరకే ప్రస్తావితమైన దరువు కూడా ఉన్నాయి. రాగ-భావనా సౌష్టవమే దీక్షితార్ రచనలకున్న మహోత్కృష్ట లక్షణం. దీనిని పూర్తిగా గణుతి చేయాలంటే భారతదేశ శిష్ట సాంప్రదాయ సంగీతానికి రాగభావమే పునాది అని గుర్తుంచుకోవాలి. ఇదే దానికీ పాశ్చాత్య సంగీతానికి మధ్యగల భేదం. అయితే రాగమంటే ఏమిటి! కొన్ని నిర్దుష్ట స్వర సంచారాల సుమధుర సమ్మేళనమే రాగం. రాగ విభిన్నత ఆయా రాగాల కుండే విశిష్ట స్వర సంచారాలపైనే ఆధారపడి ఉంటుంది. ఈవిధంగా ప్రతిరాగానికి ఇతర రాగాలకు భిన్నమైన వైయుక్తిక విశిష్టత ఉంటుంది. నిజానికి రాగాలను దైవ స్వరూపాలుగా వర్గీకరించడం జరిగింది. దేవ, దేవేరుల దేహములు నాదాన్వితాలుగా భావించడం జరిగిందని ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. "నాదతనుంఅనిశం" అనే కృతిలో త్యాగరాజు "ఎవరి దేహం నాదమో ఆ శంకరునికి ప్రణమిల్లు తాను" అంటాడు.[1] నాదాన్నే తన రూపంగా చేసుకున్నదని దీక్షితార్ తరచు దేవిని వర్ణిస్తాడు. తాను రచించిన "వంశవతి శివ యువతి" అనే కృతిలో ఆయన స్వరాలను, 22 శృతులను దేవీ స్వరూపాన్వితాలుగా అభివర్ణిస్తాడు.[2] రాగరూపాలను విన్యాసించడం, అంటే "రాగాలాపన"ను సంగీత కళ యొక్క అత్యున్నత రూపంగా ఎల్లప్పుడూ

---

[1]నాదతను మనిశం శంకరం నమామి.

[2]ద్వావింశశ్రుతి స్వర స్వరూపిణి.

పరిగణించడం జరుగుతోంది. భక్తుడు తన దైవాన్ని శిరస్సు నుండి పాదం వరకూ వర్ణిస్తూ గానం చేసినట్టే సంగీత కళావేత్త మంద్రస్థాయి నుండి తారాస్థాయి వరకు స్థాయి విస్తరించి ఉంటే సంచారాలలో సముచితమైన వాటి ద్వారా రాగరూపాన్ని చిత్రీకరిస్తాడు. ఈవిధంగా రాగాలాపనకు సంబంధించిన విస్తృతమైన సాంకేతిక సంహిత, సాంకేతిక రచనా సముదాయం, రాగరూపాలను విపులీకరించడం లక్ష్యంగా కల ప్రబంధాలు అభివృద్ధి అయాయి. శబ్ద చిత్రం వంటి రాగభావనలో సాహిత్యానికి ( పదాలకు) చోటు లేదు. అందుచేతే రాగాలాపన అనేది "ఆకార" శబ్దాల ద్వారా రాగరూపాన్ని తీర్చిదిద్దటం మాత్రమే. అప్పుడప్పుడు "త" "ర" "న" వంటి అక్షరాలను అందులో ఉపయోగించినట్లయితే అది శబ్ద సముచ్చయాలను సులభంగా వెలువరించే సౌకర్యం కొరకు మాత్రమే. వాటి కక్కడ ఎటువంటి ప్రాముఖ్యం లేదు. రాగాలకు, గీతాలకు మధ్య మౌలిక భేదం ఇక్కడే ఉంది. రాగాలు శబ్ద చిత్రా (నాద)న్వితాలవుతే, గీతాలు పదాల (సాహిత్య) చే నిర్మితాలు, పాశ్చాత్య సంగీతంలో అత్యంత శ్రేష్టమైన శిష్ట సాంప్రదాయ కీర్తనలున్నాయి. కాని అందులో స్వర క్రమమెట్లు ఉన్నాయి కాని రాగాలనేవి లేవు.

సముచిత సాహిత్యం ద్వారా భక్తి రసాన్ని వ్యక్తం చేయడం, ఉత్తేజం పరచడం లక్ష్యంగా కల కృతులను వాగ్గేయకారత్రయం రచించారు. అయితే రాగాలే కనుక పదాలను అధిగమించడం జరిగితే ఇటువంటి రచనలలో రాగభావ సమస్య ఎలా ఉత్పన్నమవుతుందనే ప్రశ్న తలెత్తడం సహజం. దీనికి సమాధానం చెప్పాలంటే దక్షిణ భారత దేశ సంగీతరంగంలో కృతులకున్న చరిత్రను స్పృశించవలసి ఉంటుంది. ప్రధానంగా రాగాలాపనలోనే కానవచ్చే శిష్ట సాంప్రదాయ సంగీతంతోపాటు భక్తి కీర్తనల కాలవాలమైన సంగీత స్రవంతి యుగ యుగాల నుండి ప్రవహిస్తూ వస్తూనే ఉంది. ఇదే "భజన సంగీతం" గా ప్రసిద్ధి కెక్కింది. జానపద గేయాల వలే గాక భజన గీతాలను శిష్ట సాంప్రదాయ సంగీతానికి సంబంధించిన రాగాలకు తాళాలకు నిబంధించడం జరిగింది. అయితే భక్తి భావాన్ని వంట బట్టించడమే భజన గీతాల లక్ష్యం కాబట్టి వాటిలో పదాలు వాటి అర్థాలే ప్రధానంగా ప్రాముఖ్యాన్ని

సంతరించుకుంటాయి. కీర్తనల రసపుష్టిని మరింత పరిపుష్టం చేసే సాధనాలుగా మాత్రమే ఇక్కడ శిష్ట సాంప్రదాయ రూపాలను చేపట్టడం జరుగుతుంది. మరో మాటలో చెప్పాలంటే సంగీతం ఇక్కడ సాహిత్యానికి లోబడి ఉంటుంది. ఈ లక్ష్యానికి కట్టుబడే కీర్తన భావానికనుగుణ్యమైన సామాన్య రాగాలను ఎంపిక చేయడం జరుగుతుంది. అవి మనస్సును భక్తి రసం నుండి రసాత్మక రాగ సౌందర్యాల వైపు మళ్లించేవిగా ఉండవు. ఈవిధంగా శిష్ట సాంప్రదాయ భజన సంగీత బాణీల లక్ష్యాలు, ప్రక్రియలు భిన్నంగా ఉంటాయి. సర్వ సాధారణంగా వాటి కంకితమైన వారు కూడా విభిన్నులే.

పదునెనిమిదవ శతాబ్దం వరకు దక్షిణ భారత దేశంలో పరిస్థితి ఇది. అప్పుడు సంగీతాన్ని ఆచరణలో విప్లవాత్మకం చేసిన పరిణామమొకటి సంభవించింది. ఈనాటి కృతి ఆవిర్భావమే ఆ పరిణామం. ఇది పురందర దాసుతో ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఆయన గీతాలు సాంకేతికపర రచనలు. శిష్ట సాంప్రదాయ రీతులలో సంగీతాన్ని అభ్యసించే విద్యార్థులకు రాగ లక్షణాలను బోధించడమే ఆయన లక్ష్యం. వాటి విశిష్ట సంచారాలను స్వరాలలో అమర్చడం ద్వారా లక్ష్యాన్ని సాధించడం జరిగింది. దీనికి తోడు భగవంతుని స్తుతించడానికి ఉద్దేశితమైన సాహిత్యం కూడా స్వర ప్రసారాల కనుగుణ్యంగా సమకూరింది. గీతాలలోని స్వర అంశాలను నేర్చుకొనడాన్ని సులభతరం చేయడమే దీని లక్ష్యం. ఇప్పుడు వెంకటమఖి వద్దకు వద్దాం. అసంఖ్యాకంగా ఉన్న ఆయన లక్షణ గీతాలు చాలా విస్తృతమైనవి. ఇక్కడ కూడా అవధారణ స్వర సంచారాల మీదే ఉన్నప్పటికీ దానికనుగుణంగా ఎల్లప్పుడూ భగవతారాధనకే అంకితమైన సాహిత్యం కూడా ఉంది. ఈ స్థితినుండి ఆధునిక "కృతులు" ఆవిర్భవించడం అతి సాధారణమైన సహజ పరిణామం. స్వర సంచారాలను వదలివేసి దేవతలను కీర్తించే సాహిత్యానికి మాత్రమే పరిమితమయ్యే నూతన రూపం ధరించిన పాత గీతమే "కృతి". పద్దెనిమిదవ శతాబ్దంలో ఈరకపు రచనలు అమలులోనికి వచ్చి "వాగ్గేయకారత్రయం" చేతులలో పరిపూర్ణ స్థాయికి చేరుకున్నాయి. "లక్షణ" గీతాల భజన పాటల లక్షణాలను రెండింటినీ సమ్మిళితం చేయగల లబ్ధ ప్రయోజనం ఈ ప్రక్రియకుంది. ఈ రెండు లక్షణాల తారతమ్య అవధారణ

వివిధ వాగ్గేయకారుల కీర్తనలలో విభిన్నంగా ఉంటుంది.

పై అంశాలను దృష్టిలో ఉంచుకొని ఆయన రచనలన్నీ దేవుళ్ళను, దేవతలను కీర్తించేవి కనుక అవిభక్తి ప్రధానమైనవనే ప్రాతిపదికతో దీక్షితార్ రచనల పరిశీలనను ప్రారంభిద్దాం. అయితే ఆయన అద్వైతవాది అని ఇది వరకే చెప్పడం జరిగింది. దేవుళ్ళందరూ అన్ని నామరూపాలకు అతీతుడైన "ఒకే ఒక సృష్టికర్త", "పరబ్రహ్మ యొక్క వివిధ స్వరూపాలనీ, వారి ఆరాధన (సగుణోపాసన) తనలో పరబ్రహ్మను సాక్షాత్కరింప జేసుకొనేందుకు చేబట్టే గమనంలో ఒక అడుగు మాత్రమేననీ ఆయన మౌలిక విశ్వాసం". ఈవిధంగా జ్ఞానం భక్తిని నియంత్రించడం జరిగింది. దీక్షితార్ సంగీతంలోని అనేక లక్షణాలను ఈ అంశం విశదం చేస్తుంది. ఒక వాగ్గేయకారుడు భావోద్వేగ పారవశ్యంలో ఉన్నప్పుడు సహజంగానే అతడు దానికనుగుణమైన రాగాలనే ఎంపిక చేసుకుంటాడు. అంతేకాక తన రచనా భావానికి సరిపడే రాగ సంచారాలనే ప్రయోగిస్తాడు. మరో మాటలో చెప్పాలంటే రాగస్వరం భావోద్రేకానికి లొంగి ఉంటే రాగ విన్యాసం వ్యక్తి విషయ పరంగా (subjective) ఉంటుంది. కాని ఎక్కడైతే మేధస్సు ఆధిపత్యం వహిస్తుందో భావోద్రేకం దానికి లొంగి ఉంటుందో రాగం ఎంపిక గానీ, దాని విన్యాసం కానీ భావోద్రేక నియంత్రణ ఆధీనమవవు. దీక్షితార్ విషయంలో ఇదే జరిగింది. ఇక్కడ వాగ్గేయకారుడు తన మనోగతిని రచనా సమయాన్ని అనుసరించి రాగాన్ని ఎంపిక చేస్తారు. దానిని విపులీకరించుటలో రాగరూపానికి తగిన ప్రాముఖ్యత నిచ్చి దాని పూర్తి స్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. ఇటువంటి సందర్భంలో రాగ చిత్రీకరణ వస్తు విషయపరం (objective)గా ఉంటుంది. దీక్షితార్ కృతులలో మనం ఇదే చూస్తాం."అక్షిప్తిక", "రాగవర్షిని", "విదారి", "వేదామకరిణి", అంగాలుగా కల "రాగ-ఆలాపన" ననుసరించి రూపొంది సంగీత శాస్త్ర సిద్ధాంతాలలో నిక్షిప్తమైన ఆలాపనా పద్ధతి లో ఆయన నిష్ణాతుడు. కృతి చిత్రీకరణలో ఈ పద్ధతినే అనుసరించాడు. కృతిలో ప్రదర్శించిన రాగ రూపం స్పష్టంగా, ఖచ్చితంగా, పరిపూర్ణంగా ఉండేది. సంచారాలు రాగ లక్షణాలనికనుగుణంగా ఉండి దాని నిజ ముఖారవిందాన్ని వెలికి తెచ్చేది. అవి మంద్రం నుండి తారాస్థాయి వరకు సంచరిస్తూ దాని

పరిపూర్ణ చిత్రమును ప్రదర్శించేవి, సాహిత్యాన్ని లుప్తం చేసి "అకర" లో రచనను వెలువరించినట్లయితే దానిని సంక్షిప్త రూపంలో నున్న రాగాలాపన అని సులువుగా అపోహ పడవచ్చు. తాళ గతిలో అమర్చడానికి చెక్కిన సాహిత్యంతో ముస్తాబైన రాగాలాపనగా కృతిని వర్ణించవచ్చు. ఇదే దీక్షితార్ కృతులలో ప్రధాన ఆకర్షణీయమైన అంశం. త్యాగరాజు వలెనే దీక్షితార్ కూడా అనేక అపురూప, సుపరిచిత రాగాలను ప్రయోగించాడు. జనరంజకమైన, సుప్రసిద్ధ రాగాలలో అనేక కృతులను రచించాడు. వీటిలో రాగ లక్షణాలకు సంబంధించిన వివిధ అంశాలను వెలువరించడం జరిగింది. ఉదాహరణకు తోడి రాగాన్ని తీసుకోవచ్చు. ఇది ప్రధాన రాగాలలో ఒకటి. ఇందులో త్యాగరాజు 20 కీర్తనలను రచించాడు. దీక్షితార్ కూడా ఈ రాగాన్ని పరిపూర్ణంగా చిత్రీకరిస్తూ అనేక కృతులను రచించాడు. విభిన్న స్వరాలలో ఎరుపు (అక్షిధిక) కలిగిన రాగ చిత్రణను ప్రదర్శించడమే ఈ కీర్తనలలో గమనించదగ్గ అంశం. పల్లవిలో విభిన్న ఎరుప్పు (ప్రారంభ) స్వరాలు కల కొన్ని కీర్తనలను ఈ క్రింది పట్టికలో పేర్కొనడం జరిగింది.

దాక్షాయణి- ధైవత (మంద్రస్థాయి)

శ్రీసుబ్రహ్మణ్యో - గాంధార
మహాగణపతిం- మధ్యమ
పాలయమాం- పంచమ
రామచంద్రాయ- ధైవత
కమలాంబికె- నిషాధ
} మధ్యస్థాయి

ఈ కృతులు రాగాన్ని వివిధ కోణాల నుండి ప్రదర్శిస్తాయి. ఈ కోణాలన్నిటి నుండి ఆ రాగాన్ని దర్శించవచ్చు. అయినప్పటికీ పరిపూర్ణమైన, సమగ్రమైన రాగ చిత్రణ కాన వస్తుంది. వివిధ భంగిమలలో ఒక వ్యక్తి ఛాయాచిత్రం తీసినట్లుగానే ఇది ఉంటుంది. ఈ రీతిలోనే దీక్షితార్ భైరవి, కాంభోజి, శంకరాభరణం, కళ్యాణి రాగాలలో అనేక కృతులను రచించాడు. సావేరి, సహనా, అఠాణ, రామక్రియ (కామవర్ధిని), గమకక్రియ (పూర్వ కళ్యాణి), సారంగ మొదలైన సుప్రసిద్ధ జనరంజక రాగాలలో విరచితమైన

కృతులను గురించి కూడా ఇదే విషయం చెప్పనచ్చు.

మంగళ కైసికి, ఘంట, గోపికా వసంత, నారాయణ గౌళ మొదలైనవి ప్రాచీన రాగాలలో కొన్ని. వాటి లక్షణాలను తెలుసుకోవాలంటే మనం దీక్షితార్ కీర్తనలను పరిశీలించక తప్పదు. ఇవిగాక దీక్షితార్ మాత్రమే ప్రయోగించిన అనేక ఇతర రాగాలున్నాయి. సారంగనట, ఛాయాగౌళ, పూర్వి, పాడి, మాహురి, శుద్ధ వసంత, కుముదాక్రియ, అమృత వర్షిణి మొదలైన వాటిని వీటికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఆయన ద్విజవంతి రాగంలో రచించిన "చేతస్ శ్రీ" ఏకైక మహోజ్వల కీర్తనగా నిలచింది.

దీక్షితార్ వివడి మేళాను ప్రయోగించిన తీరు గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. వెంకట మఖి మేళా పథకాన్ననుసరించి ఒక రాగాంగరాగం (ఇప్పుడు మేళ కర్త రాగంగా వ్యవహరించడం జరుగుతోంది) లోసప్త స్వరాలుండి తీరాలి. ఈ సూత్రంపై కృషి చేయడంతో పాటు ఐదు వికృతి స్వరాల వైవిధ్యాలను పరిగణనలోనికి తీసుకొని ఆయన 72 రకాల సమ్మేళనాలను రూపొందించిడం సాధ్యమని నిర్ధారించాడు. వీటినే రాగాంగ రాగాలని పేర్కొన్నాడు. ఈ నిర్ణయానికి రావడానికి ఆయన ఒకే స్వరం యొక్క రెండు రూపాంతరాలు (కోమల, తీవ్ర) ప్రదర్శితమయ్యే రాగాలను పరిగణనలోనికి తీసుకొన్నాడు. ఇందులో సాహిత్య స్వర సంజ్ఞను పరిగణనలోనికి తీసుకొన లేదు. స్వరానికుండే రెండురూపాంతరాలలోని ఒక దానికి సన్నిహిత స్వరసంజ్ఞ పేరిచ్చి వాటికి కూడా మేళ రాగాలని ముద్ర వేశాడు. ఈవిధంగా "కోమల" "తీవ్రరిషభ" స్వరరూపాంతరాలను రెండిటిని ఒక రాగం సంతరించుకొన్నప్పుడు ఇక్కడ "గాంధారం" లుప్తమైనప్పటికీ ఆయన రెండవ దానికి "శుద్ధగాంధారం" గా పేరు పెట్టారు. అదే విధంగా ఒక రాగం "గాంధారం"లోని రెండు రూపాంతరాలను (సాధారణ, అంతర) సంతరించుకొన్నప్పుడు ఇందులో రిషభం లేకపోయినప్పటికీ ఆయన సాధారణ గాంధారానికి "షట్-శృతి రిషభం" అని పేరు పెట్టారు. ఇదే రీతిలో ఒక రాగంలో "ధైవత" స్వర రెండు రూపాంతరాలు ఉచ్ఛ అష్టమ స్వరంలో ప్రదర్శితమైనపుడు ఇక్కడ "నిషాదం" లేకపోయినప్పటికీ పై స్వర సంజ్ఞను "శుద్ధ నిషాదం"గా పేర్కొనడం జరిగింది. ఇదే విధంగా ఒక రాగంలో రెండు

నిషాదాలు (కాకళి, కైసికి) మాత్రమే సంభవించి ధైవతం లోపించినప్పటికీ కైసికి నిషాదాన్ని షట్-శ్రుతి ధైవతం గా పిలవటం జరిగింది. ఈ ప్రక్రియ ప్రకారం రూపొందిన రెండు సన్నిహిత స్వర సంజ్ఞల సమ్మేళనంలో సరిపొందక ఉండరాదనే ప్రాతిపదిక మీద ఏర్పడిన ఈ మేళాలు వివడి మేళాలుగా ప్రాచుర్యం పొందాయి.

ఈ పథకంపై గణనీయమైన విమర్శ వచ్చింది. ఒకే స్వరాన్ని రెండు విభిన్న పేర్లతో పిలువడం అసంగతంగా ఉందని విమర్శకుల వాదన. కాని వాస్తవానికి ఈ పని చేసింది వెంకటమఖి కాదు. అంతకు 300 సంవత్సరాలకు పూర్వమే షట్‌శ్రుతి సహిత నటరాగాన్ని, శుద్ధ గాంధార సహిత వరాళి రాగాన్ని మేళాలుగా వర్గీకరించడం జరిగింది. దక్షిణ భారత సంగీత రంగంలో ఈ ప్రాచీన రాగాలు ఘన రాగాలుగా ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నాయి. తనకు పూర్వమే ఉన్న పథకాన్ని దాని తార్కిక సమాప్తి స్థాయికి తీసుకపోవడమే వెంకటమఖి చేసిన పని. అయితే ఆయన ఈ మేళాల కల్పనలో నిజమైన రాగభావానికి తగినంత ప్రాముఖ్యం యిచ్చారని ఈ సందర్భంలో చెప్పవలసి ఉంది. చెవికి ఇంపుగా ఆహ్లాదకరంగా ఉండాలనేది నిజమైన రాగ భావన. దీనిననుసరించి ఆయన రాగ లక్షణాలను తీర్చిదిద్దడంలో సరిపొందిక లేని సమ్మేళనాల జోలికి పోలేదు. "జరు" వంటి "గమకాల"లో వెలువరించడానికి అనువుగా ఉన్నప్పుడే రాగాలు "సంపూర్ణ ప్రయోగ" శక్తిని సంతరించుకొంటాయి. లేకపోయినట్లయితే అసంగతమైన "స్వరసంజ్ఞలు" వక్రసంచారాలుగా రాగాంబరంలో అల్లుకుపోతాయి. ఉదాహరణకు మొదటి మేళా అయిన కనకాంబరిలో వెంకటమఖి "స రి గ మ గ రి స" లేదా "ప ద ని స ని ద ప" అనే ప్రయోగాలను కాక "స రి మ గ రి స" మరియు "ప ద స ని ద ప" అనే ప్రయోగాలను ఉపయోగించాడు. వెంకట మఖి తదనంతర దశలోనే ఒక సంగీత వ్యాకరణ వేత్త వివడిమేళాలలో కూడా సంపూర్ణ ప్రయోగాల భావనను ప్రవేశపెట్టారు. దీనితో స్వర క్రమానికి రాగానికి మధ్య ఉండే భేదం మరుగునపడి పోయింది. అయితే విశిష్టవైణికుడైన వెంకటమఖి ఈ గతుకులలో అడుగిడకుండా తగు జాగ్రత్త వహించాడు. నూతన వివడి మేళాలను రూపొందించేటప్పుడు కూడా స్వరక్రమాన్ని కాక రాగ మాధుర్యాన్నే వాటి ప్రధాన లక్షణంగా చేయడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాడు. ఇక ముత్తుస్వామి

దీక్షితార్ గురించి చెప్పాలంటే ఆయన వివడి మేళాలతో సహా 72 మేళాలోనూ కృతులను రచించాడు. నిజానికి రసమంజరి రాగం (వెంకటమఖి మేళాలలో 72వది) లో విరచితమైన "శృంగార రసమంజరి" అనే కృతిలో ఆయన "72 రాగాంగాలలోనూ ఆనందానుభూతిని పొందుచున్న" దానిగా దేవిని వర్ణిస్తాడు.[1] వివడి మేళాల నిర్వహణలో వెంకట మఖి మార్గదర్శకత్వాన్ని ము.చ. తప్పకుండా అనుసరించారు. స్వర పొందిక లేని ప్రయోగాల జోలికి పోలేదు. కనకాంబరి రాగం (ఒకటవ మేళం)లోని "కనకాంబరి కారుణ్యామృతలహరి" పెనద్యుతి రాగం (రెండవ మేళం)లోని "శ్రీ దక్షిణామూర్తిం" కళావతి రాగం (31వ మేళం) లోని "కళావతి కమలాస్యవత్" వంశావతిరాగం (54వ మేళం)లోని "భక్తవత్సలం" అనే కీర్తనలను దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు.

ముత్తుస్వామి దీక్షితార్ వైణికుడు. గాయకుడు. గానం చేసేటప్పుడు వీణ సహకార వాయిద్యంగా ఉండేది. తాను భైరవి రాగంలో రచించిన "బాల గోపాల" అనే సుప్రసిద్ధ కృతిలో ఆయన ఈ వాస్తవికాంశాన్ని సూచించారు. ఇందులో వైణికగాయక గురు -గుహునిచే స్తుతింపబడిన వారిని (వైణికగాయక గురు - గుహనుత)గా పరమాత్మను గురించి ప్రస్తావించడం జరిగింది. ముత్తుస్వామి దీక్షితార్ సంగీతంలోని కొన్ని విశిష్ట లక్షణాలను ఈ గాత్ర, వాయిద్య సంగీత సమ్మేళనానికి ఆపాదించవలసి ఉంది. ఆయన కీర్తనలు విలంబకాలంలో ఉంటాయి. కొన్ని చరణాలు మాత్రం చివరన మధ్యకాలంలో ఉంటాయి. గాయకునికి వేగాన్ని అదుపు చేయడం సాధ్యమైనప్పటికీ ప్రక్క వాయిద్యానికి దానిననుసరించడం కష్టసాధ్యమవచ్చు. కాని విలంబ కాలంలో మాత్రమే పరిపూర్ణ రాగ సౌందర్యాన్ని రాబట్టడానికి వీలవుతుందనే విషయాన్ని ఎవరూ కాదనలేరు. విలంబకాలంలో మాత్రమే రాగ రూపాంతరాలను యథాతథంగా వాటి పరిపూర్ణ సౌందర్యాన్ని వ్యక్తం చేసే రీతిలో వెలువరించడానికి సాధ్యమవుతుంది. త్వరితగతిలో అనేక సున్నితమైన రాగచ్ఛాయలు మరుగున పడిపోయే అవకాశం ఉంది. సాధారణ రాగానుభూతి మాత్రం మిగులుతుంది. కాని దానినే కనుక విలంబకాలంలో ఆలపించినట్లయితే దాని లక్షణాలన్నింటినీ పూర్తిగా యథార్థంగా వెలువరించడానికి వీలవుతుంది. ఈ కారణం వల్లనే రాగ రూపాల విస్తరణకు విలంబకాలమే

[1] వెంకటమఖి సాంకేతిక పదజాలంలో మేళాలను రాగాంగ రాగాలని పేర్కొనడం జరిగిందని గుర్తుంచుకోవాలి.

సరియైనదని భావించి దానికి రాగాలాపనలో ప్రముఖస్థానం ఇవ్వడం జరిగింది. దీక్షితార్ విలంబ కాలాన్ని చేబట్టడానికి ఆయన కృతులలోనున్న రాగ-భావ సంపదకు ఆయనకు వీణా వాయిద్యంలోనున్న ప్రావీణ్యమే కారణమని చెప్పవలసి ఉంటుంది.

గమక సంపదాభూయిష్టమై ఉండడం దీక్షితార్ కృతులకున్న మరొక విశిష్ట లక్షణం. కీర్తనలకు సౌందార్యాన్ని సంతరించిపెట్టే సొగసులే గమకాలు. ప్రామాణికులలోని వైవిధ్యాన్ననుసరించి వీటి సంఖ్య పది నుండి పదిహేను వరకు మారుతూ ఉంటుంది. వాటిని వెలువరించడానికి వీణే సరియైన వాయిద్యం. దానిమీద సున్నితమైన రాగచ్ఛాయలను వెలువరించడానికి సాధ్యమవుతుంది. కాబట్టి గమకాలలో అధిక భాగం వీణావాయిద్యం లోనే ఆవిర్భవించాయి. ఆ కళలో దీక్షితార్ దిట్ట కాబట్టి ఆయనకు గమకాలపై ఆధిపత్యం లభించింది. అందుచేతనే ఆయన తన కీర్తనలను వాటితో సుసంపన్నం చేశాడు. అంతగమక సంపద కల రచనలు చేసిన మరొక వాగ్గేయకారుడు కర్నాటక సంగీతరంగంలో లేడనేది వివాదాస్పదమైన విషయం కాదు. కీర్తనలలో సంగీత సాహిత్యాల సమపాందికలో సమ్మిళితం కావాలనే అంశంపై దీక్షితార్ ప్రత్యేక శ్రద్ధ వహించేవాడు. కీర్తనా గానంలో సాహిత్యం వక్రీభూతమై గుర్తించడానికి వీలులేనంతగా రూపురేఖలను కోల్పోడం అరుదైన విషయం కాదు. మరో మాటలలో చెప్పాలంటే సంగీత సాహిత్యాలిక్కడ సమజోరుగా ఉండవు. కాని దీక్షితార్ కీర్తనలలో ఈవిధంగా ఎన్నడూ జరగదు. ఆయన కృతులను గానం చేసేటపుడు పదాలు స్పష్టంగా, ప్రస్ఫుటంగా వెలువడతాయి. ఇంకా చెప్పాలంటే సాహిత్య సౌందర్యాన్ని గుర్తింపును సంగీతం ఇక్కడ ధ్వంసం చేయదు. తన సుప్రసిద్ధ శ్లోకాలలోని ఒక దానిలో కాళిదాసు పార్వతీ పరమేశ్వరులను ఒకే పదంగా ఒకే అర్థంగా మిళితమై ఉన్నారని స్తుతిస్తాడు.[1] దానిని అన్వయిస్తూ దీక్షితార్ కీర్తనలలో సంగీత

---

[1]వాగర్థావివ సంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే।
జగతః పితరౌవందే
పార్వతీ పరమేశ్వరౌ ॥ (రఘువంశ 1-17)

సాహిత్యాలు పార్వతీ పరమేశ్వరుల వలె సమ్మిళితమై ఉన్నాయిని చెప్పవచ్చు.

తాను కాశీలో నివసించినప్పుడు దీక్షితార్ హిందూస్తానీ సంగీతంలో తగినంత పరిజ్ఞానం సంపాదించాడని ఇదివరకే చెప్పడం జరిగింది. తమ స్వతసిద్ధ రూపవర్ణాలన్నిటితోను కర్నాటక సంగీతంలో విలీనమైన అనేక హిందూస్తానీ రాగాలను ఆయన ఆలపించడం దీని ఫలితమే. అంతేకాదు, సాధారణంగా రాగాలాపనలో కూడా ఆయన కీర్తనలపై హిందూస్తానీ సంగీత ప్రభావాన్ని గమనించగలం. హిందూస్తానీ కర్నాటక సంగీత బాణీల రెండింటిలోనూ గమకాలు సార్వత్రికమైనవే. అయినప్పటికీ, మొదటి తరహా సంగీతంలో "జరు" వంటి కొన్ని గమకాలకే ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. దీక్షితార్ రచనలు కూడా ఈ గమకానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. విలంబకాల సంగీతానికి కొన్ని గమకాలు చాలా సమయోచితంగా ఉంటాయని సర్వసాధారణంగా చెప్పవచ్చు. అందుచేత హిందూస్తానీ రాగాలాపనలోనూ, దీక్షితార్ రచనలలోనూ ఇవి ఎక్కువగా చోటు చేసుకొనడం ఆశించే విషయమే. ఈ గమకాలను ఆలపించే సమయంలో దీక్షితార్‌ను ఆయనకు సానుకూలమైన హిందూస్తానీ సంగీతంలో దర్శించగలం.

ఇక తాళాల గురించి ఆలోచిద్దాం. రాగం వలెనే తాళం కూడా భారతీయ సంగీతానికి మౌలికమైనది. "వీణను ఏవిధంగా వాయించాలో తెలుసుకున్న శ్రుతులు, జతులు, తాళాలు గురించి తగిన పరిజ్ఞానమున్న వ్యక్తి మోక్ష మార్గార్హుడవుతాడు" అని యాజ్ఞవల్క్యుడు వ్యక్తం చేస్తాడు. అప్పటి నుండి అది సర్వామోద దృక్పథంగానే కొనసాగుతోంది. ఫలితంగా హిందూస్తానీ కర్నాటక బాణీలు రెండింటిలో తాళం ప్రముఖ స్థానం ఆక్రమించింది. కర్నాటక సంగీతంలోని తాళ పద్ధతి యొక్క జటిలత్వాన్ని గురించి ఇక్కడ సవిస్తరంగా వివరించనవసరం లేదు. గొప్ప వాగ్గేయ కారులందరూ దానికి తమ రచనలలో ప్రముఖ స్థానమిచ్చారని చెప్పితే చాలు. సులదిసప్త తాళాల (నవ గ్రహ కృతులు)ను ఆధారం చేసుకొని దీక్షితార్ ఏక మొత్తంగా ఒక కృతి సముచ్ఛయాన్నే రచించాడు. దీనిని గురించి ఇది వరకే ప్రస్తావించడం జరిగింది.

# అధ్యాయం 8

# సాహిత్యం, దాని విషయాంశాలు

దీక్షితార్ కీర్తనలలో అత్యధిక భాగం సంస్కృతంలో ఉన్నాయి. కొద్దిపాటి సాహిత్యం మాత్రం అనేక భాషలలో ఉండే "మణిప్రవాళం" లో ఉన్నాయి. కావ్యాలను, అలంకారాలను, వ్యాకరణాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి దీక్షితార్ సంస్కృతంలో నిష్ణాతుడయ్యాడు. సంప్రదాయ కర్నాటక సంగీతంలో ఎక్కువగా ద్యోతకమయ్యే తెలుగు భాషలో కూడా ఆయనకు మంచి పరిజ్ఞానం ఉంది. తమిళం ఆయన మాతృభాష. దీక్షితార్ ఈ భాషలనన్నింటిలోనూ తన రచనలను సాగించాడు. అయితే వీటిలో సంస్కృతమే ప్రతిష్టాత్మక స్థానం ఆక్రమించింది. దీనికి చాలా కారణాలున్నాయి. ప్రతి భాషకు తనదైన విశిష్ట లక్షణాలుంటాయి. ఒక తమిళునికి భావోద్వేగాన్ని వ్యక్తం చేయడానికి తమిళం కంటె మెరుగైన మాధ్యమం మరొకటి ఉండదు. తెలుగుభాష మృదువుగా, మధురంగా ఉంటుంది. అది "ప్రాచ్య ప్రపంచ ఇటాలియన్" అని పేరుపొందడం సమంజసం. అందుచేతనే కర్నాటక సంగీత రచనలలో అధికతర ప్రాబల్యం వహించింది. సంస్కృతం శబ్ద సంపన్నమైంది. నాదాన్వితమైనది. మహా గంభీరమైనది. దీక్షితార్ కృతులలో అవధారణ భావోద్వేగం మీద కంటే రాగ సంచారాల రసోత్కృష్టత మీదనే ఎక్కువగా ఉంటుంది. అందుచేత ఆయన తన సంగీత వ్యక్తీకరణకు సంస్కృతాన్ని మాధ్యమంగా ఎన్నుకొనడం యుక్తమైనదే. ఆయన ప్రదర్శించిన రాగ చిత్రాలు సమగ్రమైనవి. గంభీరమైనవి. అయితే వాటిని అచ్ఛాదించే సాహిత్యం, నాద విలువ దృష్ట్యా వైభవోపేతంగానూ, మహత్తరంగానూ ఉంటుంది. ఆయన తన సాహిత్య భాషగా సంస్కృతాన్ని చేబట్టడానికి మరొక కారణం కూడా ఉంది. కీర్తనలన్నీ

దేవ దేవతలను స్తుతిస్తూ రచించినవే. అందుచేత నామావళులు, స్తోత్రాలు, సాహిత్యానికి మంచి విషయ వస్తువును సమకూరుస్తాయి. అవి సంస్కృతంలో ఉంటాయి. దీక్షితార్ వాటినుండి స్వేచ్ఛగా తనకవసరమైన విషయ సంపదను గ్రహించాడు. ఈ క్రింది వాటిని దీనికి సోదాహరణలుగా పేర్కొనవచ్చు. "కంజదళాయతాక్షి" అనే కీర్తనలోని "ఏకానేకాక్షరి" అనే వర్ణన త్రిసతిలోనున్న "ఏకానేకాక్షరకృతి" అనే అభివ్యక్తీకరణపై ఆధారపడింది. "కాదంబరి ప్రియయై" అనే కీర్తనలోనున్న "సదాచార ప్రవర్తికాయై" అనే వర్ణన సహస్ర నామంలోని మాటలకు మక్కీకి నమూనాయే. "వీణా పుస్తక ధారిణిం" అనే కృతిలోని జటాజూట మకుటం అనే వ్యక్తీకరణను "మహిషా సుర మర్దనిం" అనే కృతిలోని "ప్రణధజన సౌభాగ్య జననిం" అనే వ్యక్తీకరణను "ఆనంద లహరి" శ్లోకం నుండి తీసుకొనడం జరిగింది. గౌరి రాగంలో నున్న "గౌరిరాజకుమారి" అనే కృతిలోని మధ్యమ కాల సాహిత్యం "ఆనందలహరి" లోని "సుధాసింధోర్ మధ్యే" అనే శ్లోక పునరుత్పత్తి మాత్రమే. అంతేగాక, ఇది వరకే చెప్పినట్లుగా దీక్షితార్ అద్వైత వాది. దానిలో సగుణ, నిర్గుణోపాసనలకు తావుంది. అందుచేత ఆయన ఒక ప్రక్క వివిధ నామరూపాలలోనున్న దేవతల ఆరాధనకు ప్రాముఖ్యమిస్తూనే మరొక ప్రక్క వారంతా నామరూపాలకతీతుడైన పరబ్రహ్మ యొక్క ప్రతిమూర్తులు మాత్రమేనని అభివ్యక్తం చేశాడు. సగుణాభి వర్ణనకు స్తోత్ర సాహిత్యం నుండి విస్తృతం పదజాలాన్ని గ్రహిస్తూనే అద్వైత తత్వ భావనలను వ్యక్తం చేయడానికి మాత్రం వేదాంత సాహిత్యాన్ని ఆశ్రయించాడు. ఆయనకీ సాహిత్యంలో ఎంతలోతైన పరిజ్ఞానముందో ఆయన రచించిన అనేక కృతుల ద్వారా మనం గ్రహించవచ్చు. "త్యాగరాజధన్యం" అనే కృతిలో భగవంతునిపై చేసిన వర్ణన అంతా "పరమాత్మ" వర్ణనే. ఇందులో "త్రిగుణాతీతుడు, సత్య-జ్ఞాన-ఆనందమూర్తి, ద్వైత తత్వ భ్రాంతి కల మనస్సుకు విభ్రాంతి కలిగించేవాడు"[1] అని ఆయన పరమాత్మను వర్ణిస్తాడు. "గురు -

---

[1]సత్వర జస్త మోగుణాతీత సత్య జ్ఞానానంద రూపిణే ।
ద్విత్వాది భేదవ ఘన పరమార్ధ ద్వైతత్వాత్మా ।
నంద రూపిణియో

గుహ"కృతులలోని ఒక దానిలో "జీవ ఏకత్వాన్ని తనయినే ప్రక్షిప్తం చేసుకున్న" పరమాత్మగా భగవంతుని వర్ణిస్తాడు. అంతేకాదు "జహదజహ లక్షణాయాన్ని" మూలాధారంగా పేర్కొంటాడు.[1] వేదాంత, మీమాంస శాస్త్రాలలో ఇది అత్యున్నత స్థాయికి చెందిన పరిజ్ఞానం.

ఇకపోతే, తాంత్రిక సూత్రాలననుసరించి దేవిని ఆరాధించడమే ప్రధాన అంశంగా కల "నవ వరాన" వంటి కృతులున్నాయి. తంత్రాలు సంస్కృతంలో ఉన్నాయి కాబట్టి సాహిత్యం కూడా అదే భాషలో ఉండడం సముచితంగా ఉంటుంది. రచనల యొక్క రసానుభూతి లక్షణానికి వాటి విషయ వస్తు స్వభావానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చినందువల్లనే దీక్షితార్ సంస్కృతానికి ప్రాధాన్యత ఇచ్చాడని దీనిబట్టి గ్రహించవచ్చు. ఆయన రచనల విషయ వస్తువులోని అధిక భాగం స్తోత్రాల వేదాంత తాంత్రిక సాహిత్యాల ప్రాంగణాల నుండి ఆవిర్భవించిందేనని ఈ సందర్భంలో గ్రహించాలి.

దీక్షితార్ కృతులకు ఎక్కువ కవిత్వ విలువ లేదనే విమర్శ కొన్ని సందర్భాలలో వచ్చింది. కాని ఇది కవిత్వ సంగీతాల నిజమైన క్రియాశీలతను పొరపాటుగా అర్థం చేసుకోవడమే. విభిన్న పరిసరాలలో, సందర్భాలలో ఒవించే మానవుని యొక్క, లోకం యొక్క చిత్రాన్ని మనకందజేయడమే కవిత్వ పరమావధి. దీనిని అర్థవంతమైన, సూచీప్రాయమైన మాటల ద్వారా నిర్వహించడం జరుగుతుంది. కనుక భావార్థమే ప్రధానమైంది. చిత్రాలను ప్రదర్శించడమే శిష్ట సాంప్రదాయ సంగీత లక్ష్యం. పదాలను అందులో ఉపయోగించడం జరిగితే అది వాటి నాదధ్వని విలువను పెంపొందించేందుకు మాత్రమే. ఉత్తమ కవిత్వం ఉండవచ్చు. కాని సంగీతానికది సరిపడకపోవచ్చు. అదేవిధంగా ఉత్తమ సంగీతం కవిత్వానికి అనుగుణంగా లేకపోవచ్చు. ఒక వాగ్గేయకారుడు కవి కూడా అయినట్లయితే ఆయన రచనలు సంగీత రీత్యా కవిత్వరీత్యా విలువైనవి కావడం సహజం. కాని ఒక గొప్ప సంగీత రచన ఉత్తమ కవిత కాకపోయినంత మాత్రాన అది తన విలువను పోగొట్టుకోదు.

వ్యాకరణ దోషాలున్నాయనేది దీక్షితార్ సాహిత్యం పై వచ్చిన మరొక

[1]జహద జహల్లక్షణయా జీవక్యాత్మనో ।

విమర్శ. సంగీత రచనలలో ఉపయోగించే వ్యక్తీకరణ రూపాలు అంత కట్టుదిట్టంగా ఉండవు. వాటిలో కొంత సడలింపు ఉంటుంది. ఈ సందర్భంలో వాగ్గేయకారులకు కొంత స్వేచ్ఛ ఉంటుంది. దీక్షితార్ కౌముది (వ్యాకరణం)ని అధ్యయనం చేశాడు. ఆయన విభక్తి కృతులు ఆయనకు భాష మీద మంచి పట్టు ఉందనే విషయాన్ని వెల్లడి చేస్తాయి. అయితే సంగీత ప్రదర్శనకు తగిన ప్రాధాన్యత ఇవ్వవలసిన అగత్యం ఏర్పడినప్పుడు వాగ్గేయకారుల నిజ సాంప్రదాయాన్ననుసరించి అప్పుడప్పుడు వ్యాకరణ నియమాలను ఉల్లంఘించాడు. కాని ఇదైనా చాలా అరుదుగా జరిగింది. కాబట్టి దానికంత ప్రాముఖ్యమివ్వనవసరం లేదు.

దీక్షితార్ తన రచనలలో ఉపయోగించిన వివిధ అలంకారాలను పరిశీలిస్తే ఆయన సాహిత్యాల నాద గత విలువకు ఎంత ప్రాముఖ్యమిచ్చాడో అవగతమవుతుంది. శిష్టసాంప్రదాయ వాగ్గేయకారులందరూ చేసినట్లే ప్రాస, అనుప్రాసలను ఉపయోగించడమే గాక "గోపుచ్ఛ", "స్రోతోవాహ" అనే అలంకారాలను కూడా దీక్షితార్ ఒక్కడే తన కృతులలో ఉపయోగించుకున్నాడు. "గోపుచ్ఛ" రచనలో పద స్వరోచ్చారణ క్రమానుగతంగా, నిలకడగా దిగజారితే "స్రోతోవాహ" లో దానికి విరుద్ధంగా ఉంటుంది. ఆనందభైరవి రాగంలోనున్న "త్యాగరాజయోగ వైభవం" అనే కృతిలో మనం ఈ రెండు అలంకారాలను చూడవచ్చు. అందలి పల్లవిలోని సాహిత్యం ఈ క్రింది విధంగా సాగుతుంది-"అగర రాజ యోగ వైభవం- వైభవం-భవం-వం". దీనిని గోపుచ్ఛ చరణంలో మనం ఈ కింది పదగమనం చూడవచ్చు.

"శం-ప్రకాశం-స్వరూప-ప్రకాశం-తత్వస్వరూప ప్రకాశం-సకల తత్వ స్వరూప ప్రకాశం- శివ శక్త్యాది సకల తత్వ స్వరూప ప్రకాశం" ఇది "స్రోతోవాహ". ఈ పాఠ్యాంతరాలలో సాహిత్యాల ఆటుపోటులు రాగ, తాళ సంచారాలకు సమఉజ్జీలో ఉంటాయి. తరంగిణి రాగంలోనున్న "మాయె", శ్రీరాగంలోనున్న "శ్రీవరలక్ష్మి" వంటి దీక్షితార్ ఇతర కృతులలో కూడా ఈ అలంకారాలను గమనించవచ్చు.

కృతుల విషయాంశాల గురించి ఇది వరకే అనేక రచనలను గురించి ప్రస్తావించినపుడు చర్చించడం జరిగింది. మళ్లీ చెప్పాలంటే దీక్షితార్

కృతులలో అధిక భాగం దేశంలోని అన్ని ఆలయాలలో నున్న అన్ని దేవతలను కీర్తిస్తాయి. అవి స్థానిక కథలను, గాథలను గ్రంథస్థం చేసిన కవిలెకట్టలు. తాంత్రిక రీతిలో దేవి ఆరాధన కంకితమైన రచనలున్నాయి. శ్రావణమాసంలో వరలక్ష్మి పూజ రోజున లక్ష్మి దేవిని పూజించడానికి శ్రీ రాగంలో విరచితమైన "శ్రీ వరలక్ష్మి కీర్తన", వినాయక చతుర్థి రోజున గణేశ ప్రభుని పూజించడానికి చామరాన్ (ప్రస్తుతం షణ్ముఖ ప్రియ) రాగంలో విరచితమైన "సిద్ధి వినాయకం" అనే కీర్తన వంటివి ప్రత్యేక సందర్భాలలో దేవతలను కీర్తించడానికి ఉద్దేశితమైన రచనలు.

కర్మ, భక్తి, జ్ఞాన మార్గాల ద్వారా మోక్షాన్ని సాధించ వచ్చునని మన శాస్త్రాలు ప్రభోదిస్తాయి. వాటిన్నంటికే మన జీవితంలో స్థానముంది. ఈ విషయం ముత్తుస్వామి దీక్షితార్ జీవితంలో చక్కగా చిత్రీకరణమైంది. చివరి వరకు ఆయన దినసరి పూజలు నిర్వహిస్తూనే ఉన్నాడు. తన మనస్సును స్వాధీనంలో ఉంచి దానిని భగవంతుని వైపు మళ్లించడానికి ఆయనకది తగిన శక్తినిచ్చింది. ఆయన పరమ భక్తుడు. ఒక ఆలయం నుండి మరొక ఆలయానికి యాత్రలు చేస్తూ అచ్చటి దేవతలను కీర్తిస్తూ గానం చేయడమే ఆయన జీవిత సాధన. ఆయన వేదాంతి. ఉపనిషత్ చింతలలో జీవించాడు. తన మనోనేత్రం ద్వారా సృష్టికర్తను అన్నిచోట్ల, అన్ని వస్తువులలోనూ దర్శించాడు. శంకరాచార్యుడు ప్రతిపాదించిన వేదాంత సిద్ధాంతాలననుసరించి ఈ యావత్ ప్రపంచము మాయా కల్పితము, ఊహాజనితమైనదని భగవంతుని తనలో ఆత్మ సాక్షాత్కారం చేసుకొనేందుకు మానవుడు తన వివేకం ద్వారా ఈ "మాయ"ను జయించవలసి ఉందని ఆయన గ్రహించాడు. తరంగిణి రాగంలో తాను రచించిన "మాయె" అనే కీర్తనలో "మాయా నన్ను వదలిపెట్టు నన్ను ఇబ్బంది పెట్టడానికి నువ్వెవరు?" అని వ్యక్తం చేస్తాడు. ఆయన నిజమైన జ్ఞాని.

దీక్షితార్ ఒక మహాయోగి. ఆయన నాదోపాసకుడు. ఆయన ఆత్మరాగ రూపాలలో సంక్షిప్తమైన సౌందర్యంలో బ్రహ్మానందాన్ని కనుగొనగలిగింది. కర్నాటక, హిందూస్థానీ రాగాల రెండింటిలోనూ రూపు దిద్దుకొనడం ఆయన రచనల ఏకైక విశిష్టత. భారత దేశ సంస్కృతీ భాష అయిన సంస్కృతంలో

విరచితమయ్యాయని తెలుసుకున్నప్పుడు దీక్షితార్‌ను అఖిల భారత వాగ్గేయకారుడని సులభంగా గుర్తించవచ్చు. 1975వ సంవత్సరం ఫాల్గుణ మాసంలో ఆయన ద్విశతాబ్ది జరిగింది. భారతదేశ సంస్కృతిని ఉద్ధరించిన మహానుభావులలో ఒకడైన ఈ వాగ్గేయకార యోగీశ్వరుని స్మృతిని గౌరవించడానికి భారత దేశమంతటా ఉన్న సంగీత విద్వాంసులకు సంస్కృతీవేత్తలకు ఇది సముచిత సందర్భం.



# కొన్ని విశిష్ట రచనలు

వేద వేదాంత, యోగ, జ్యోతిష్య, ఆగమ, మంత్ర శాస్త్రాల వంటి వివిధ విద్వత్ శాఖలలోనూ ముత్తుస్వామి దీక్షితార్‌కి ప్రగాఢమైన పరిజ్ఞానం ఉంది. ఆయన రచనలలో ఇది ప్రతిఫలించింది. ఆయనకున్న అపారవిద్యత్సంపద గురించి పాఠకునికి స్థూలాభిప్రాయం కలుగజేసేందుకు వివిధ రకాలకు ప్రాతినిధ్యం వహించే కొన్ని కృతులను, వాటి ఇంగ్లీషు అనువాదాలతో క్రింద ఇవ్వడం జరిగింది. మక్కీకి మక్కీ అనువాదానికంటె మూల రచన యొక్క నిజమైన స్ఫూర్తిని వెలికి తీయడానికి మాత్రమే ఇంగ్లీష్ పాఠ్యం ఉద్దేశితమైనది.

1

ఈ క్రిందిది గణపతి దేవుని కీర్తనగా రచించిన కృతి, గణపతికి సంబంధించిన ఆగమాలలో దీక్షితార్ నిష్ణాతుడు. ఆ దేవునిపై 20పై చిలుకు కృతులను రచించాడు. ఈ రచన ఆయన విద్వత్ప్రతిభకు వేదాంత యోగ శాస్త్ర పరిజ్ఞానానికి ప్రతీక.

"శ్రీమూలాధార-రాగః శ్రీ-తాళ ఆది

పల్లవిః శ్రీమూలధార చక్ర వినాయక- అమూల్య వర ప్రదాయక"

అను పల్లవిః "మూలాజ్ఞాన శోక వినాశక

మూలకందముక్తి ప్రదాయక॥"

చరణముః సకలీకృత దేవాధి దేవ శబలీకృతసర్వజ్ఞ స్వభావ

ప్రకటీకృత వైరవైరీ స్వభావ, పరాభవప్రసిద్ధ గజగ్రీవ

వికట షడశత వాసాధికార, విచిత్రాకారభక్తోపకార

అకలంక విభాస్వర విఘ్నేశ్వర, హరగురుగుహ సోదర లంబోదర

అనువాదం

మూలాధార చక్రం[1] మీద ఆసీనుడైన వినాయకా! జయహో! నువ్వు ఇచ్చే వరాలు అమూల్యమైనవి. ఈ విశ్వాంతరాళ ఉద్భవానికి నువ్వే మూలకారకుడవు. అనాదిగా వస్తున్న అజ్ఞానాన్ని[2], దుఃఖాన్ని నాశనం చేసి భక్తులకు మోక్షాన్ని ప్రసాదిస్తావు. దేవతలందరూ నీలోనే మూర్తీభవించి ఉన్నారు. మూర్తివి[3] ఓ వికటా! నువ్వు 600 సంఖ్యాగత ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నియంత్రిస్తావు.[4] ఓ ప్రఖ్యాత గజానన! నీ రూపం అద్భుతమైనది. నీ భక్తులకు లబ్ధులను ప్రసాదిస్తావు. ఓ విఘ్నేశ్వరా! నువ్వు నిష్కళంక ఉజ్వలమూర్తివి. ఓ లంబోదరా! నువ్వు గురు-గుహుని సోదరుడవు.

2

ఈక్రిందిది గురు-గుహ లేదా తిరుత్త విక్రృతులలో ఒకటి. వాటిలో అత్యంత జనాదరణ పొందింది. ఈ కీర్తన యొుక్క వేదాంత నేపథ్యం గమనార్హం.

మానస గురు-గుహ-రాగం: ఆనందభైరవి-తాళం: రూపక

పల్లవి:మానస గురుగుహ రూపం భజరేరే, మాయామయ

హృత్తాపం త్యజరేరే!

అనుపల్లవి: మానవజన్మని సంప్రాప్తే సతి. పరమాత్మని నిరతి

శత సుఖం వ్రజరేరే

చరణము: సత్వ గుణోపాధి సహిత సదాశివం, స్వవిద్యా

సమేత జీవో ద్రవమ్

తత్వం తామసయుత విశ్వవైభవం, తారకేశ్వర

---

[1]తంత్ర శాస్త్రాన్ననుసరించి మానవ శరీరంలో ఆరు చక్రాలున్నాయి. అవి మూలాధార, మణిపూరక, స్వాధిష్టాన, అనహత, విశుద్ధి, ఆజ్ఞ.

[2]మూలాధార చక్రంపై అధివశించిన దేవతగా గణేశుడు అభివర్ణితుడు.

[3]శబ్దానికి 4 భాగాలుంటాయి. పరపశ్యంతి, వైఖరి, మధ్యమ, వైఖరి సుస్పష్టమైన శబ్దం. అర్థవంతమైన భాషా శబ్దంలో దీనిని ఉపయోగించడం జరుగుతుంది.

[4]మూలాధార చక్రానికి సంబంధించిన ఉచ్ఛ్వాస నిశ్వాసల సంఖ్య ఇది.

మానంద భైరవమ్!

సత్యా శ్రీ గురు చరణమ్, కృత్వానామస్మరణమ్,

జిత్వామోహావరణమ్, మత్వాతదేశ శరణమ్

అనువాదం

ఓ మనసా! గురు-గుహుని రూపాన్ని తెలుసుకో, మాయామయ మానసిక వ్యథలను త్యజించు. మానవ జన్మ సంప్రాప్తించింది. ఇక పరబ్రహ్మలో నిత్యానందం పొందడానికి ప్రయత్నించు. సత్వగుణం[1] మూర్తీభవించిన సదాశివుడే గురు-గుహుడు. అజ్ఞాన ప్రభావ ఫలితంగా జీవులన్నీ ఆయన నుండే ఉద్భవించాయి. అంతేకాదు. తామసిక లక్షణ సహిత ఈ విశ్వమంతా ఆయన మహోన్నతకు ప్రతిమూర్తే. ఆయన ముక్తిని ప్రసాదించే ఆనందభైరవుడు. ఆయన ముందు ప్రణమిల్లు. ఆయన నామాన్ని జపించడంలో నిమగ్నుడవు. భ్రమ జనితమైన ముసుగును జయించు. ఆయనొక్కడే నీ శరణాగతుడని భావించు.

3

దీక్షితార్ రచించిన తొమ్మిది ఆవరణ కీర్తనలలో ఒకదానిని ఈ క్రింద ఇవ్వడం జరిగింది.

దేవిని పూజించడానికి కుద్దేశితమైన ప్రత్యేక తతంగాలను తంత్రాలు నిర్దేశిస్తాయి. వీటిననుసరించి దీక్షితార్ దేవీ కమలాంబపై 11 కీర్తనల సముచ్చయాన్ని రచించాడు. ఆయనకు తంత్రాల మీద, మంత్ర శాస్త్రాల మీద ఉండే పరిపూర్ణ ఆధిపత్యం తన అత్యున్నత స్థాయిలో ఈ కృతులలో కానవస్తుంది.

శ్రీకమలాంబికాయ-రాగం: శంకరాభరణం- తాళం: రూపక

పల్లవి: శ్రీ కమలాంబికయ కటాక్షితోహం,

సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మోస్మి

అనుపల్లవి: పాకశాసనాది సకల దేవతాయా,

---

[1]ఈ సృష్టిలో నున్న జీవులన్నిటిలోనూ ప్రదర్శితమయ్యే స్వతసిద్ధ లక్షణాలే గుణాలు. వాటిని ఈ విధంగా వర్గీకరించారు- సత్వ (యోగ్యత, పరిశుద్ధత), రజస్ (శక్తి, క్రియాశీలత), తమస్ (అంధకారం, మందకొడితనం).

పంకజాసనాది పంచకృత్యకృత్భావితయా
శీక హర చతుర పదయా,
మూక ముఖ్య వాక్ప్రదయా
కోక నద విజయ ప్రదయా
గురుగుహత్తర ప్రదయా
చరణం:అనంత కుసుమా ద్యష్ట శక్త్యాకారయా
అరుణ వర్గ సంక్షోభణ చక్రా గారయా
అనంత కోటి యడ నాయక శంకర నాయికయా,
అష్ట వర్గాత్మక గుప్త తరయా వరయా
అనంగా ద్యుపాసితియా, అష్టదళాబ్జ స్థితయా
ధను వీణ ధరకరయా, దయా సుధాసాగరయా

అనువాదం

శ్రీకమలాంబ తన కటాక్ష వీక్షణాలను నామీద ప్రసరించినది.పరిపూర్ణ నిత్యానందాన్ని పొందుతున్న బ్రహ్మంను నేను. ఇంద్రుడు, సకల దేవతలు ఆ దేవికి సేవ చేస్తారు. పంచ కృత్యాలలో నిమగ్నులై ఉన్న[1] బ్రహ్మాది దేవతలు ఆమె ధ్యానంలో ఉన్నారు. ఆమె మూగకవి అయిన "మూక" కు వాక్కును ప్రసాదించింది. ఆమె పాదాలు నీలి పద్మాలలా ఉన్నాయి. ఆమె గురు-గుహ స్వామి బోధించిన మహావాక్యం "తత్వమసి" కి ప్రతీక. ఆమె రూపం అనంగ కుసుమ మొదలైన అష్టశక్తుల[2] కలయిక. ఆమె సంక్షోభనాచక్రం[3]లో

---

[1]ఆగమాలననుసరించి దేవతలు నిర్వర్తించ వలసిన విధులు ఐదు రకాలుగా ఉంటాయి. అవి సృష్టి, స్థితి (ఆధరవు అంటే పరిరక్షణ) లయ (వినాశనము) తిరోధన (ఆచ్ఛాదనమును తొలగించుట) అనుగ్రహ (దయచూపుట).

[2]తంత్రాలనుసరించి దేవి అష్ట శక్తి స్వరూపిణి. అనంగకుసుమ, అనంగమేఖల, అనంగమదన, అనంగమదనాతుర, అనంగరేఖ, అనంగాకుశ, అనంగవేగిని, అనంగమాలిని.

[3]తంత్రాలనను సరించి దేవి సన్నిధిని చేరడానికి భక్తుడు తొమ్మిది చక్రాల గుండా పయనించవలసి ఉంటుంది. ఈ చక్రాలను త్రైలోక మోహన, సర్వాష సంక్షోభన, సర్వ సౌభాగ్యదాయక, సర్వార్థసాధక, సర్వరక్షాకర, సర్వరోగహర, సర్వసిద్ధిప్రదాయక, సర్వానందమయుడంటారు.

ప్రతిష్ఠితమై ఉంది. ఆమె ఈ సకల విశ్వానికి అధిపతి అయిన శంకరుని సహధర్మ చారిణి. ఆమె ఎనిమిది అక్షర సముచ్ఛయాలలో[1] ప్రకటితమయ్యే గుప్త-యోగిని. అనంగుడు తదితరులకు[2] ఆమె ఆరాధ్య దేవత. అష్ట దళాలున్న పద్మం ఆమె నివాసము. ఆమె విల్లంబులను తన చేతులలో ధరిస్తుంది. ఆమె దయా సుధాంభోనిధి.

4

ఈక్రింది కృతి తిరువారూర్ లోనున్న ఒక శివాలయాన్ని కీర్తిస్తూ రచించినది. ఇందులో ఈశ్వరుని సగుణాకారంలో కాక శంకరాచార్యుడు ప్రతిపాదించిన వేదాంత సిద్ధాంతాల ననుసరించి నిర్గుణతత్వంలో ప్రశంసించడం జరిగింది.

ఆనందేశ్వరే-రాగం: ఆనందభైరవి-తాళం: త్రిపుట:

పల్లవి: ఆనందేశ్వరే-సంరక్షితోహం
విద్యానందరూపోస్మి బ్రహ్మానంద రూపోస్మి

అనుపల్లవి: జ్ఞాన ప్రదాన గురు గుహరూప
చిదానందనాథ స్వరూప ప్రకాశేన!

చరణం:అవయత్రయాతే తేన నిత్యేన
అవస్థాత్రయ సాక్షి నాతిశుద్దేన
భవపంచ కోశ వ్యతిరిక్తేన బుద్ధేన,
శివ సచ్చిదానంద రూపేణ ముక్తేన,
శ్రవణ మనన నిధి ధ్యాసన సమాధి, నిష్టా
పరోక్షానుబవ స్వమాత్రవశోషిత

---

[1]హల్లులు అక్షరాలలో 38. వీటిని క,చ,ట,త,ప, య,ష,హ-లతో ప్రారంభమయ్యే ఎనిమిది సముదాయాలుగా విభజించడం జరిగింది. వీటిపై పైన పేర్కొనిన అష్టశక్తులు ఆధ్వర్యం వహిస్తాయి. వీటినే సమిష్టిగా "గుప్త యోగిని" అంటారు.

[2]దేవి ఉపాసకులలో 12 గురు పేరెన్నిక గల వారు ఉన్నారు. వీరిలో కృతిలో ఉటంకించిన అనంగుడు గాక మిగిలిన వారు. మను, చంద్ర, కుబేర, లోపాముద్ర, అగస్త్య, అగ్ని, సూర్య, ఇంద్ర, స్కంధ, దుర్వాస.

ప్రకాశమాన మహేశ్వరే...!

అనువాదం

జ్ఞానబోధ (ఆధ్యాత్మిక జ్ఞానం) చేయు గురువైన సుబ్రహ్మణ్య స్వామి రూపంలో ఆనందేశ్వరుడు తన రూపాన్ని చిదానందనాధునికి వెల్లడి[1] చేశాడు. సర్వేశ్వరుని రక్షణలో నేను నిత్యానంద స్థితిలో, బ్రహ్మానంద స్థితిలో ఉన్నాను. ఆయన మూడు శరీరాలకు అతీతుడు. అనంతుడు.[2] ఆయన మూడు స్థితులకు సాక్షీభూతుడు, పరిశుద్ధుడు.[3] ఆయన ఐదు కోశములకు అతీతుడు, ప్రాజ్ఞుడు.[4] ఆయన సదానందరూపుడు-స్వేచ్ఛామూర్తి. నువ్వు ఆయన సందేశం వినాలి. ఆయనను గురించి ఆలోచించాలి. ఆయనను ధ్యానించాలి. ఆయనను నాలోనే సాక్షాత్కరింప జేసుకొనే అనుభవం కలుగుతుంది.

5

దీక్షితార్ సగుణాకారంలో భగవంతుని కీర్తించిన కృతులనేకం ఉన్నాయి. వీటి విషయ వస్తువు పురాణాల నుండి గ్రహించడం జరిగింది. బాలకృష్ణ ప్రభునిపై విరచితమైన ఈ క్రింది కృతి భాగవత పురాణంపై ఆధారపడినది.

చేతస్ శ్రీ బాలకృష్ణమ్-రాగం:జయ జయవంతి-తాళం:రూపక

పల్లవి: శ్రీ బాలకృష్ణం భజరేరే

చింతితార్థ ప్రద చరణార

విందం ముకుందం

అనుపల్లవి: నూతన నీరద సదృశ శరీరం

నంద కిశోరం, పీత వసన

ధరం కంబు కం ధరమ్,

---

[1] తిరుత్తనిలో దీక్షితార్ పొందిన అనుభూతిని ఇక్కడ సూచించడం జరిగింది.

[2] మన శాస్త్రాల ననుసరించి మూడు రకాల శరీరాలున్నాయి. అవి స్థూల, సూక్ష్మ, కారణ.

[3] మూడు స్థితులివి-జాగృత్ ( మెలకువగా ఉండుట), స్వప్న (కలకనుట), సుషుప్తి (నిద్రావస్థ).

[4] మానవాత్మ ఐదు కోశములలో అమరి ఉంది. అవి అన్న, ప్రాణ, మనస్సు, ప్రజ్ఞానన, ఆనంద. ఈ కోశాలన్నిటి నుండి విముక్తి అయినప్పుడే దానికి స్వేచ్ఛ లభిస్తుంది.

పూతనాది సంహారం,

పురుషోత్త మావతారం

శీతల హృదయం విహారం

శ్రీ రుక్మిణీ తారమ్||

చరణం: నవనీత గంధ వాహ వదనం మృదు వచనం,

నళిన పత్ర నయనం వటపత్ర శయనం,

నవ చంపక నాశికం అధసేసుమ భాసకం

నతేం ద్రాదిలోక పాలకం మృగమద తిలకం,

నవతులసీ వనమాలం నారదాది మునిజాలం

కువలయాది పరిపాలం గురు గుహనుత గోపాలం||

అనువాదం

ఓ మనసా! పద్మంలా సుందరంగా నున్న పాదాలు కల బాలకృష్ణుని పూజించు. ఆయన నీ కోరికలను తీరుస్తాడు. ఆయన నందగోపాల బాలుడు, కొత్తమబ్బు వంటి శ్యామవర్ణము, పసుపు వస్త్రాలను ధరిస్తాడు. శంఖు ఆకారంలో ఉండే కంఠం కలవాడు. ఆయన పూతనను వధించాడు. మందరగిరి పర్వతాన్ని ఎత్తాడు. రుక్మిణిని తరింప జేశాడు. ఆయన విష్ణుమూర్తి అవతారం. సత్పురుషుల హృదయాలలో నివసిస్తాడు. ఆయన ముఖం వెన్న వాసనలను వెదజల్లుతుంది. ఆయన మాటలు మృదువైనవి. ఆయన నయనాలు పద్మపత్రాలలా ఉంటాయి. ఆయన వటపత్రం మీద శయనిస్తాడు. ఆయన నాశిక చంపక పుష్పంలా ఉంటుంది. ఆయన అధాసి పుష్పంలా ప్రకాశవంతంగా ఉంటాడు. కస్తూరీ తిలకధారి. ఇంద్రుడు, తదితర లోకపాలురు ఆయనకు ప్రణమిల్లుతారు. ఆయన తులసీమాలను, పుష్పాలను ధరిస్తాడు. నారదుడు, తదితర మునులు ఆయనను సేవిస్తుంటారు. ఆయన జగద్రక్షకుడు. గురు-గుహుడు కీర్తించిన గోపాలుడు.

6

లక్ష్మీదేవిని కీర్తిస్తూ చేసిన రచన ఇది. ఆయన దీనిని ఏ సందర్భంలో రచించారో ఇది వరకే ప్రస్తావించడం జరిగింది. శ్రీసూక్తమనే వేదమంత్రాన్ని

జనరంజకంగా అనుసరించడం ఈ కృతికున్న విశిష్ట లక్షణం. సంస్కృత కీర్తనల ద్వారా వేద నిధులను సాధారణ ప్రజలకు అందుబాటులోకి తేవడం దీక్షితార్ మన సంస్కృతికి చేసిన అద్భుతమైన సేవ.

హిరణ్మయిం లక్ష్మిం-రాగం: లలిత-తాళం: రూపక

పల్లవి: హిరణ్మయీ లక్ష్మీం సదా భజామి హీన మానవాశ్రయం త్యజామి!

అనుపల్లవి:స్థిరతర సంపత్ప్రదాం క్షీరాంబుధి తనయాం,
హరివక్ష స్థలాలయాం హరిణేం
చరణకి సలయాం కరకమల ధృత కువలయాం,
మరకత మణి మయ వలయామ్!

చరణం:శ్వేత ద్వీప వాసినీం శ్రీ కమలాంబికాంపరాం,
భూత భవ్య విలాసినీం
భూసుర పూజితాంవరాం
మాతరంబు మాలినీం,
మాణిక్యాభరణ ధరాం సంగీత వాద్య
వినోదినీం గిరిజాస్తా మిందిరాం,
శీత కిరణ నిభవదనాం
శ్రిత చింతామణి సదనాం
గురు-గుహ మాతులకాంతాం లలితాం!

అనువాదం

నే నెల్లప్పుడూ లక్ష్మి దేవినే ప్రార్థిస్తాను. హీన మానవుల ఆశ్రయించలేను. ఆమె నాకు అంతులేని సంపదను అనుగ్రహిస్తుంది. ఆమె సుధాంభోధిలో జన్మించింది. హరివక్ష స్థలం మీద అధివసించింది. ఆమె పాదాలు మొలకలంతటి సున్నితమైనవి. ఆమె రమణీయమైన చేతులలో కువలయ పుష్పం ఉంటుంది. ఆ చేతులకామె మరకతమణులతో వాడిన కంకణాలను ధరిస్తుంది. శ్రీకమలాదేవి శ్వేత ద్వీపంలో నివసిస్తుంది. ఆమె సర్వోన్నతి. ఈ విశ్వమంతా ఆమె కేళీ విలాసమే. ఆమె బ్రాహ్మణుల ఆరాధ్యదైవం.

పద్మపుష్పమాలను, మాణిక్య ఖచిత ఆభరణాలను ధరిస్తుంది. ఆమె గిరిజకు మిత్రురాలైన ఇందిర. ఆమె చంద్రముఖి. తన భక్తులకు వరాలను ప్రసాదించే నిజమైన చింతామణి. గురు-గుహ మాతులుని పత్ని. పసుపు రంగు వస్త్రధారిణి. సమ్మోహిని.

7

దీక్షితార్ జ్యోతిష్యశాస్త్రంలో దిట్ట. నవగ్రహాలను కీర్తిస్తూ ఆయన రచించిన కీర్తనలలో దీనిని చూడవచ్చు. జనశృతిలో ఇవి నవగ్రహ కీర్తనలుగా ప్రసిద్ధి చెందాయి. ఈ క్రింది కృతి బృహస్పతి పైన విరచితము. ఏ సందర్భములో అది రచించబడినదో ఇది వరకే చెప్పడం జరిగింది.

బృహస్పతే-రాగం:అఠాణ-తాళః త్రిపుట

పల్లవి:బృహస్పతే తారాపతే, బ్రహ్మజాతే నమోస్తుతే!

అనుపల్లవి:మహాబల విభో గీష్పతే, మంజుధనుర్మీనాధిపతే

మహేంద్రాద్యు పాసితాకృతే, మాధవాది వినుతధీమతే!

చరణం: సురచారవర్య, వజ్రధర, శుభలక్షణ జగత్రయగురో

జరాది వర్జితాక్రోధ కచజన కాశ్రిత జనకల్పతరో,

పురారి గురు గుహనం యోదిత పుత్ర కారక దీనబంధో।

పరాదిచత్వారి వాక్ స్వరూప ప్రకాశక దయాసింధో।

నిరామయనీతికర్తే నిరంకుశ శాయ విశ్వభర్త్రే,

నిరంజనాయ భువన భోక్త్రే, నిరంశాయ సుఖపెదాంతే॥

అనువాదం

ఓ బృహస్పతీ! తారాభర్తా! ఓ బ్రాహ్మణా! నీకు ప్రణమిల్లుతున్నాను. ఓ మహాబల వాక్పతీ! ధనుస్సు, మీనరాసుల అధిపతీ! మహేంద్రునికి నువ్వు ఆరాధ్యనీయుడవు. మాధవుడు తదితరులు నీ మేధస్సంపదకు నిన్ను కీర్తించారు. ఓ దేవతల మహాగురూ! నువ్వు వజ్రాయుధాన్ని ధరిస్తావు. ఓ త్రైలోక గురూ! నీ నామమే శుభప్రదమైనది. వృద్ధాప్యం. క్రోధం నిన్నంటవు. ఓ కచుని పితా! నువ్వు నీ భక్తులకు వరాలు ప్రసాదించే కల్పతరువు. శివుని ఉపదేశికుడైన గురు-గుహునికి నువ్వు ఆహ్లాదం కలిగిస్తావు. ఓ దీన బాంధవా!

నువ్వు సంతానప్రాప్తి కలుగజేస్తావు. పార, తదితర నాలుగు రకాల వాక్ విభాగాలను దేదీప్యమానం చేస్తావు. నువ్వు దయాంభోనిధివి. నువ్వు దోషరహితుడవు. నువ్వే ధర్మనీతి ప్రతిష్టించావు. నువ్వు జగన్నాధుడవు. ఎటువంటి ఆంక్షలు లేని నిరంకుశడవు. నువ్వు నిష్కళంకుడవు. ప్రాపంచిక జీవితాన్ననుభవించినవాడవు. నువ్వు పరిపూర్ణుడవు. సుఖప్రదాతవు.

8

దీక్షితార్ జ్ఞానాన్ని దాని కొరకే ఆరాధించాడు. కనుక సరస్వతిని కీర్తిస్తూ ఆయన అనేక కృతులను రచించాడంటే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఈ విషయంలో శిష్ట సాంప్రదాయంలో ఆయన ఏకాకిగా నిలుస్తాడు. వీటిలో ఒక కీర్తనను ఈ క్రింద ఇవ్వడం జరిగింది:

వీణా పుస్తక ధారిణిం–రాగః వేగవాహిని–తాళం: ఝంప

పల్లవి: వీణా పుస్తక ధారిణీ మశ్రయే, వేగ వాహినీం వాణీ మాశ్రయే!

అనుపల్లవి: వీణాంకయుత జటాజూట మకుటాంతాం,

ఏకాగ్ర చిత్తనిద్యోతం విధికాంతం

చరణం:పరాద్యఖిల శబ్ద స్వరూపావకాశాం,

పౌర్ణమీ చంద్రికాధవళ సంకాశం,

కరార విందాం కళ్యాణధాం భాషాం,

కనక చంపక దామ భూషా విశేషణం,

నిరంతరం భక్తి జిహ్వా గ్రవాసం,

నిఖిల ప్రపంచ సంకోచ వికాసాం,

నరాధ మానవ విలోక శోకాపహాం

(గురు–గుహ) పూజిత విగ్రహాం॥

అనువాదం

ఒక చేతిలో వీణను, మరొక చేతిలో పుస్తకాన్ని ధరించే వేగవాహినియైన

వాణిని నేను ఆరాధిస్తాను.[1] ఒడిలో వీణతో జటాజూటంపై కిరీటంతో ఉన్న ఆమె బ్రహ్మకు భార్య. ఏకాగ్రచిత్తులే ఆమెను ధ్యానించ గలరు. పరాది అఖిలశబ్దావళి కంతకీ ఆమె మూలాధారం. ఆమె పౌర్ణమి నాటి చంద్రకాంతి వలె స్వచ్ఛమైన తెల్లనిది. ముంజేతులు కమలాల వలె కడు సుందరమైనవి. ఆమె భాష (వాక్కు). ఆమె సద్వస్తువులను ప్రసాదిస్తుంది. బంగారు రంగు చంపకపూల మాలను ధరిస్తుంది. తన్ను నిరంతరం కొలిచే భక్తుల నాలుక కొనను అధివసిస్తుంది. ఈ యావత్ విశ్వాంతరాళ సంకోచ వ్యాకోచాలకు ఆమే కర్త. మానవాధముల ముఖాలను తిలకించుట వలన కలిగే దుఃఖాన్ని హరిస్తుంది. హరిహరులు, గురు-గుహులచే పూజింపబడే విగ్రహం ఆమెది.

---

[1]అసలు పాఠం లోని సంస్కృత పదం "వేగవాహిని" అది రాగం పేరు. ఇక్కడి మాటల సందర్భాన్ని బట్టి ఉధృతమైన ప్రవాహం అని దాని అర్థం.

# పారిభాషిక వివరణ

**1. అక్షిప్తిక**

ఇది రాగాలాపనకు, అంటే రాగ విస్తరణకు, సంబంధించిన సాంకేతిక పదం. ఈ అంశానికి సంబంధించిన సిద్ధాంత గ్రంధాలు రాగాలాపన పద్ధతిని 3 భాగాలుగా విభజిస్తాయి. అవి అక్షిప్తిక (రాగరూపు రేఖలను ప్రదర్శిస్తుంది), రాగవర్ధని (రాగ విస్తరణ), విదారి లేదా మకరణి (అంత్యస్థాయి). కొన్ని సందర్భాలలో అక్షిప్తిక అనే పదాన్ని ఒక కీర్తనారంభస్వరాన్ని తెలియజేసేందుకు కూడా వాడుతారు. "గ్రహస్వర" అనేది దీనికి సాధారణామోదిత పదం.

**2. అక్షర**

స్వరసమ్మేళనలో ఉపయోగించే శబ్దాక్షర విభాగం.

**3. ఆలాపన**

అక్షిప్తికను చూడండి

**4. అరంగేత్రమ్**

తన విద్యాభ్యాసం పూర్తి అయిన తర్వాత విద్యార్థి లాంఛనప్రాయంగా ప్రదర్శించే మొట్టమొదటి సంగీత కచేరీని సూచించే దక్షిణ భారత దేశ పదం. దీనికి అర్థం. రంగాదిరోహణం.

**5. అనుపల్లవి**

కర్నాటక సంగీతంలో "కృతి" లో సాధారణంగా మూడు భాగాలుంటాయి. ప్రారంభపాఠ్య భాగాన్ని "పల్లవి" అంటారు. రాగ సంచారాలను విపులీకరించే

పాఠ్యాంతరాలతో ఉండే చివరి భాగాన్ని "చరణం" అంటారు. ఈ రెండింటి మధ్య రాగాంతర్గత దశలను వ్యక్తం చేసే "అను- పల్లవి" అనే భాగం ఉంటుంది. చాలా కీర్తనలలో ఈ అనుపల్లవి ఇమిడి ఉన్నా, కొన్ని కృతులలో ఇది లేకుండా పల్లవి, చరణ భాగాలు మాత్రమే ఉంటాయి.

### 6. ఆరోహణ

రాగ లక్షణానికి అర్థం దాని రూపాన్ని, విషయాంశాలను నిర్వచించడమే. తన ఉచ్చ నిమ్న స్థాయిలలో ఒక రాగం గ్రహించే స్వరాలు (శబ్ద స్థాయిలు) గురించి అది ప్రధానంగా తెలియజేస్తుంది. ఉచ్చ స్థానాభిముఖంలో స్వరక్రమాన్ని "ఆరోహణ" అని, నిమ్న స్థానాభిముఖంలో నున్న స్వరక్రమాన్ని "అవరోహణం" అని అంటారు. కాని స్వరాలు గురించి తెలుసుకున్నంత మాత్రాన నిజమైన రాగ స్వరూపం పూర్తిగా అర్థం కాదు. ఒక రాగం యొక్క పరిపూర్ణమైన, నిజమైన చిత్రాన్ని కూడా పరికించ వలసి ఉంది. ఉదాహరణకు, రాగం యొక్క సొగసును పెంచే అలంకారభూషితాలైన విలక్షణీయ విన్యాసాలు (సంచారాలు) గమకాలు అటువంటి అంశాలలోకి వస్తాయి. సంగీత సిద్ధాంత గ్రంథాలు వివిధ రకాల గమకాల గురించి విపులంగా వివరిస్తాయి. సాంప్రదాయకంగా వాటి సంఖ్య పది అని భావించడం జరుగుతోంది. కాని వాటి సంఖ్య పెరుగుతోంది. ఇప్పుడు వాటిని పదిహేను రకాలుగా పేర్కొనడం జరుగుతోంది.

### 7. అవరోహణం

"ఆరోహణ" ను చూడండి.

### 8. భరత నాట్యం

భరత నాట్యం ఒక నృత్యం. కర్నాటక సంగీతంలో అది అత్యున్నత దశకు అభివృద్ధి చెందింది. దానిలో అభినయమే (హావ భావ ప్రదర్శన) కాకుండా అలరిప్పు 1శబ్దం, వర్ణం వంటి అనేక అంశాలు ఇందులో ఉన్నాయి.

### 9. దరువు

భరత నాట్యంలోను, సంగీత, నృత్య నాటకాలలోను ఎక్కువగా ఉపయోగించే సాంకేతిక పరమైన రచన.

### 10. ఘన రాగాలు

"ఘన" అనేది ఒక ప్రత్యేక రక రాగ సంచారానికి ఇవ్వబడిన పేరు. మూడు లేదా నాలుగు సన్నిహిత శబ్ద స్థాయిలను తీసుకొని ఆ సముదాయంలోనే అనేక సంచారాలను ప్రదర్శించడంలో దీని పాత్ర ఉంటుంది. ఈ తీరులోనే మంద్రస్థాయి నుండి తారాస్థాయి వరకు రాగం యొక్క యావత్తు విస్తృతిని ప్రదర్శించడం జరుగుతుంది. కొన్ని రాగాలు ఈ సాధనకు గొప్పగా సరిపడినవని అతి ప్రాచీన కాలంనుండి పరిగణించబడుతున్నాయి. వీటినే "ఘనరాగాలు" అంటారు. ఉదాహరణకు నట, గౌళ, అరభి, వరాళి, శ్రీ రాగాలు ఇటువంటివే.

### 11. గీతాలు

ఇవి స్వరాల, విలక్షణీయమైన సంచారాల పరిభాషలో రాగాలను నిర్వచించే సాంకేతిక రచనలు. కర్నాటక సంగీత శిక్షణా పద్ధతిలో విద్యార్థులకు ముందుగా వివిధ రీతులలో స్వరావళిలను ఆ తర్వాత గీతాలను బోధిస్తారు.

### 12. కృతి

కృతికి అక్షరార్థం రచన. తదనంతరం సకల సాంకేతిక రచనలను, దేవతలను కీర్తిస్తూ రచించిన గీతాలను సూచించడానికి ఈ పదాన్ని వాడడం జరుగుతూ వస్తోంది. అనంతరం ఇవి జనశృతిలో కీర్తనలుగా ప్రాచుర్యం పొందాయి.

### 13. లక్షణ గీతాలు

72 మేళాలను పొందు పరుస్తూ వెంకటమఖి రచించిన గీతాలకు లక్షణ గీతాలనే పేరు వచ్చింది. మేళా పేరును, అది గ్రహించే స్వరాలను తన క్రింద

సంకీర్ణమవలసిన జన్య రాగాలను అది పేర్కొంటుంది.

## 14. మణి ప్రవాళ

ఒకే సంగీత రచనలో బహు భాషలను ఉపయోగించే ఆచారం దక్షిణ భారతదేశంలో వృద్ధి చెందింది. దీక్షితార్ రచనలలో మూడు-నాలుగు కీర్తనలు ఈ రకానికి చెందినవి ఉన్నాయి. వాటిలో సంస్కృతం, తెలుగు, తమిళం భాషలను ఉపయోగించడం జరిగింది. ఈ తరహా రచన "మణిప్రవాళం"గా ప్రాచుర్యం పొందింది. ఈ కీర్తన మణులను (మణి) ముత్యాల (ప్రవాళ)ను పొదిగిన హారాన్ని పోలి ఉంటుందని దీని సూచితార్థం.

## 15. మేళరాగాలు

సప్త స్వరాలు-సంభవించే రాగాలు "మేళ రాగాలు"గా ప్రసిద్ధి చెందాయి. వీటిని వరుస క్రమంలో గ్రహిస్తే దానిని సంపూర్ణ అంటారు. కాని సప్త స్వరాలను ప్రయోగించినా అవి వరుస క్రమంలో లేకపోతే దానిని "వక్ర సంపూర్ణ" అంటారు. అయితే ఒకటి లేదా అంతకు మించి స్వరాలు లుప్తమవచ్చు. అటువంటి రాగాన్ని జన్య రాగం అంటారు. దానిలో ప్రదర్శితమయ్యే స్వరస్థానాల కనుగుణమైన మేళంగా దానిని వర్గీకరించడం జరుగుతుంది. రెండు రాగాల మధ్య సరిపొందికా సంబంధమున్నప్పుడు వాటిని "వడి వివడి స్వరాలు" అంటారు. ఒక మేళాలో సన్నిహిత స్వరాలు వడివివడి స్వరాలయినట్లయితే దానిని వివడి మేళా అంటారు.

## 16. ముద్ర

తన స్వంత పేరును గాని లేదా దీని కొరకు తాను ప్రత్యేకంగా పెట్టుకొనిన మరొక పేరును గాని (గ్రంథకర్తను సూచించడానికి) పేర్కొనడం కృతికర్తలలో వస్తున్న ఆచారం. వాగ్గేయకారులలో పరంపరగా వస్తున్న ఆచారం. దీనినే ముద్ర అంటారు. దీనిననుసరించే త్యాగరాజు తన పేరునే "ముద్ర"గా ఉపయోగిస్తే దీక్షితార్ "గురు-గుహ"ను తన "ముద్ర"గా ఉపయోగించారు.

## 17. ప్రబంధాలు

ఇవి సాంకేతిక రచనలు. మన సంగీత సిద్ధాంత గ్రంధాలనేక రకాల ప్రబంధాలను పేర్కొంటాయి. తమిళ సాహిత్యంలో భగవంతుని కీర్తిస్తూ వైష్ణవ మతాచార్యులు రచించిన భక్తి గీతాలను "ప్రబంధాలు" అంటారు.

## 18. రాగమాలిక

వివిధ రాగాలకు చెందిన అనేక భాగాలున్న రచనను "రాగమాలిక" అంటారు.

## 19. రాగ తాళ మాలిక

అనేక రాగాలలోను, తాళాలలోను సమకూర్చిన వివిధ భాగాలున్న రచనను "రాగతాళ మాలిక" అంటారు. రామస్వామి దీక్షితార్ రచించిన 18 రాగతాళ మాలిక దీనికి లక్షణమైన ఉదాహరణ.

## 20. సాహిత్యం

రచనలోని పదాల పొందికను లేదా కూర్పును సాహిత్యమంటారు. స్వర సమ్మేళనానికి భిన్నమైనది.

## 21. స్థాయి

సప్త స్వరాలతో కూడి ఉన్న స్వర క్రమ సమ్మేళన (Octive)లోని స్థానాలను "స్థాయి" అంటారు. అన్నిటికంటె క్రిందిస్థానంలో నున్న "స్థాయి"ని "మంద్ర" అంటారు. దానికి పైనున్న దానిని "మధ్యమం" అని అన్నిటికంటె ఉన్నత స్థానంలో ఉన్న దానిని "తార" అని అంటారు.

## 22. సులది సప్త తాళాలు

కర్నాటక సంగీతంలో మౌలిక, ప్రధాన తాళాలు ఏడు. అవి ధృవ , మత్స్య, రూపక, జంప, త్రిపుట, అట, ఏక, ఈ తాళాలన్నిటిలోను శిక్షణ

యిచ్చేందుకు ఉద్దేశితమైన రచనలే "సులది రచనలు"

## 23. స్వరాలు

స్వరమంటే సంగీత శబ్ద సాంజ్ఞ. మన శాస్త్రాల ననుసరించి స్వరక్రమ నమ్మేళనంలో ఏడు శబ్ద సాంజ్ఞలున్నాయి. వీటిలో రెండు మార్పు కతీతమైనవి. వీటిని "ప్రకృతి స్వరాలంటారు". అవి షడ్జ, పంచమ స్వరాలు. మిగిలిన ఐదు స్వరాలు మార్పులకు అనుగుణంగా ఉంటాయి. వీటిని "వికృతి స్వరాలంటారు". మన శాస్త్రాలు ఈ స్వరాలలో స్థూలంగా రెండు మార్పులను గుర్తించాయి. హిందూస్థానీ సంగీత బాణీలో వీటిని "కోమల" "తీవ్ర" అంటారు. కోమల రిషభ, శుద్ధ రిషభగానూ, కోమల ధైవత, శుద్ధధైవత గానూ, కోమల గాంధార, సాధార గాంధార గానూ, తీవ్ర గాంధార, అంతర గాంధార గాను,. కోమల మధ్యమ శుద్ధ మధ్యమగాను, కోమల నిషాద, కైశిక నిషాద గాను, తీవ్ర నిషాద, కాకలి నిషాద గాను కర్నాటక సంగీతంలో గుర్తింపు పొందాయి.

## 24. వర్ణాలు

ఇవి సాంకేతిక రచనలు. చౌక వర్ణం, పద్మవర్ణం అని రెండు రకాలుగా అవి విభజితమయ్యాయి. విలక్షణమైన రాగ సంచారాలను, జటిలమైన తాళ విన్యాసాలను ప్రదర్శించగల అత్యున్నత సాంకేతిక రచనలుగా చౌక వర్ణాలు ప్రసిద్ధి చెందాయి. పద వర్ణాలు ప్రధానంగా నృత్య సంగీతంలో గానం చేయడానికుద్దేశితమైనవి.

Printed at Print Perfect, New Delhi - 64